


# తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీ వేంకటేశ్వర నిత్యాన్నదాన ట్రస్టు

(రిజిష్టరు నెంబరు 18/94)

తి.తి. దేవస్థానముల పరిపాలన భవనం, కె.టి.రోడ్డు, తిరుపతి (ఆంధ్రప్రదేశ్)




***డా॥ ఐ.వి. సుబ్బారావు,*** ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వాహణాధికారి

**ప్రియమైన దాతలకు,**

అన్నదానం కంటే మించిన దానం మరొకటి లేదు. మనదేశంలో ఆకలిగొన్న వారికి, పేదవారికి అన్నదానం చేయట మన్నది కేవలం సేవ మాత్రమేకాదు, వేదకాలం నుంచి వస్తున్న పవిత్ర సంప్రదాయం! అన్నదానం చేసిన వారికి దేవతల ప్రక్కన చోటు లభిస్తుందని పెద్దలంటారు.

తిరుమలకు వచ్చే యాత్రికులకు ఉచితంగా చక్కని భోజనాన్ని అందించే ఉద్దేశ్యంతో 1985లో "శ్రీ వేంకటేశ్వర నిత్యాన్నదాన ట్రస్టు" ప్రారంభించినప్పటి నుండి అపూర్వాదరణ చూరగొని దేశమంతటి నుండి సహృదయులైన దాతల నుండి విరాళాలు అందుతున్నాయి

**ఈ పథకం విశేషాలు :**

I ఎవ్వరైనా ఐదు లక్షలు దానికి రెట్టింపు మొత్తం (a)ఒక వ్యక్తి, (b)కుటుంబంలో ఐదుమంది కలిపి, (c)రెండు వ్యాపార సంస్థలు కలిపి, విరాళం ఇవ్వవచ్చు. వీరికి ఈ క్రింది సౌకర్యాలు లభిస్తాయి.

1 దాతల పేర్లు భోజనశాలలో ప్రదర్శిస్తారు.

2. దాతలకు సంవత్సరంలో ఎప్పుడైనా 3 రోజుల పాటు ఉచిత వసతి ఏర్పాటు చేయబడుతుంది.

3. దాతలకు సంవత్సరంలో ఎప్పుడైనా 3 రోజులు 5 మందికి మాత్రం వైకుంఠం 'క్యూ' కాంప్లెక్సు ద్వారా దర్శనము.

4. దాతలకు శ్రీ వేంకటేశ్వరస్వామి మరియు శ్రీ పద్మావతి అమ్మవారి వెండి బొమ్మలకు బంగారు పూత పూసిన జ్ఞాపిక బహూకరింపబడుతుంది. (ఒక పర్యాయం మాత్రమే)

5 ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80 (జి) క్రింద పన్ను మినహాయింపు.

సదరు దాతల విరాళాలను జాతీయ బ్యాంకులలో ఫిక్సెడు డిపాజిట్ల ద్వారా ప్రతి ఏటా వచ్చు వడ్డీతో మాత్రమే అన్నదానానికి ఉపయోగింపబడుతుంది. ప్రస్తుతం ప్రతిదినం 15,000 మందికి ఉచిత భోజన సదుపాయం కలుగజేయబడుతున్నది.

II 1,000 రూపాయలు లేదా దానికి ఎన్ని రెట్లు మొత్తాన్నయినా, ఈ శ్రీ ఎస్.వి. నిత్య అన్నదాన పథకమునకు విరాళమిచ్చి అవసరమగువారు ఈ మొత్తానికి కూడ ఆదాయపు పన్ను చట్టం సెక్షన్ 80 (జి) క్రింద పన్ను మినహాయింపు పొందవచ్చును.

III 5 లక్షల రూపాయలు ఆ పైన ఇచ్చు దాతలకు ఒక వస్త్రము, 10 చిన్న లడ్లు బహుమానముగా ఇవ్వబడును.

**విరాళాలు పంపే పద్ధతి :**

దాతలు విరాళాలను ఏ జాతీయ బ్యాంకు నుండి అయినా "శ్రీ వేంకటేశ్వర నిత్య అన్నదానం ట్రస్టు, తిరుపతి" పేరు మీద డిమాండు డ్రాఫ్టును తీసి "కార్యనిర్వాహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి (ఆంధ్రప్రదేశ్)" వారికి పంపవలెను ఇతర వివరాలకు

**కార్య నిర్వాహణాధికారి,**

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తి.తి.దే. పరిపాలన భవనం, తిరుపతి - 517 501.**

**అన్నదానంతో ఆదుకోండి! ఆత్మ సంతృప్తిని పొందండి!!**

జూన్ 2000
సంపుటి 16 సంచిక 6

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of
*"SREEVANI"* Monthly
Machilipatnam

Edited, Printed
and Published by
***Komaragiri***
***Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

*Printed at*
**SREEVANI**
**OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**7-06-2000**

# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం
కళాప్రపూర్ణ **చిలకమర్తి లక్ష్మీనరసింహం**

# భిన్నత్వంలోని ఏకత్వమే భారతీయ సంస్కృతి

"విద్యానామ నరస్వరూప మధికం
ప్రచ్ఛన్న గుప్తం ధనం
విద్యా భోగకరి యశస్సుభకరి......."

విద్యార్థులారా !

విద్యకు ఎంతటి ఘనత ఉన్నదనే విషయాన్ని గుర్తించాలి విద్యార్థులు. విద్య మానవునకు గుప్తమైన ధనం. మనం విదేశములకు వెళ్ళినప్పుడు మనకు నిజమైన బంధువు విద్యయే. గురువులకు గురువు వంటిది విద్య. రాజ్యసభలయందు విద్యనే పూజించుదురుగాని ధనమును పూజింపరు. అట్టి నిత్యమైన, సత్యమైన విద్యను నేర్వనివాడు కేవలం మూఢుడనే చెప్పబడుతాడు.

ప్రేమస్వరూపులారా !

మీరు విద్యయందు గనుక వెనుకబడుతే, మీ తల్లిదండ్రులు ఎంతగా పరితపించుదురో, మీకు తెలియదు. అటులనే నైతిక, ఆధ్యాత్మికములలో వెనుకబడిన బిడ్డను చూచి, భరతమాత కూడా అంతకంటే వేయిరెట్లు పరితపిస్తుంది. జన్మయిచ్చిన తల్లిని, జన్మభూమి అయిన భరత దేశము యొక్క బాధలను నివారణ చేయటానికి ప్రతి ఒక్కరూ కంకణధారులు కావాలి.

విద్య అనగా ఏమిటి? ఎట్టి విద్యను విద్యార్థులు అభ్యసించాలి? మానవాభ్యుదయమునకు మార్గదర్శకం ఏమిటి? అయితే ఈనాడు పవిత్రమైన ఈ విద్యా తత్త్వమును విద్యార్థులు గుర్తించడానికి ప్రయత్నించడం లేదు. ఈ విషయములను పరిశీలించి, పరిశోధించి, గుర్తించి, పరులకు అందించి ఆనందించటమే విద్యార్థుల ప్రధాన కర్తవ్యము.

వ్యక్తి యొక్క గౌరవం కేవలం విద్యవలననే లభించదు. ఈ విద్యకు సంస్కారం కూడా తోడుకావాలి. విద్య నెగిటివ్, సంస్కారం పాజిటివ్. విద్య కేవలం ఇన్‌ఫర్‌మేషన్‌గాని, ట్రాన్సఫర్‌మేషన్ కాదు. సంస్కృతియే ట్రాన్స్‌ఫర్‌మేషన్. సంస్కారంలేని విద్య నీరులేని పైరు వంటిది. కరెంటులేని వైరు వంటిది. దీపంలేని ఇల్లు, పంతులులేని బడి, దేవుడులేని గుడి వంటిది. సంస్కృతి సంస్కారములు లేకుండా కేవలం విద్యనభ్యసించడం వలన వచ్చే ఫలితం శూన్యం, గమ్యం అంధకారం.

విద్యారంగంలో సంస్కరణలు తీసుకొని రావడానికి లోగడ అనేక కమిటీలు వేయబడినాయి. వారు అనేక సూచనలు చేశారు. కానీ అవి ఆచరణ రూపం మాత్రం దాల్చలేదు. అయితే మన ప్రాచీన మహర్షులు మాత్రం అనేక విషయాలను పరిశీలించి, పరిశోధించి, పరిశుద్ధమైన

## భగవాన్ సాయి దివ్యబోధ

భావములను బహిర్గతంచేసి, వాటిని ఆచరించి, ఆనందించి, జనానికి అందించుతూవచ్చారు. అట్టి పవిత్రమైన విద్యను అభ్యసించుటకు ప్రయత్నించాలి. అయితే ఈనాడు విద్యార్థులకు కేవలం Bookish Knowledge వలననే ప్రయోజనం లేదు. దీనిని Education అంటారు. ఇది తల నుండి వచ్చేది. ఇది పుస్తకములలో లభించేది. కానీ Educare అనేది మరొకటి ఉన్నది. ఎడ్యుకేర్ అనగా ఏమిటి? లోపల ఉన్నదానిని, హృదయములో ఉన్నదానిని, గుప్తమైన దానిని, పవిత్రమైన దానిని, బయటకులాగి, దానిని పరిశీలించి, పరిశోధించి, దానిని అనుభవించాలి. 'Education' అనేది ప్రాకృతమైన విద్యలు.

**'Educare' అంతర్ముఖ్యమైన ఆనందం :**

సర్వాంగములకు మూలము మానవుని హృదయం. బాహ్యమైన ఈ జగత్తునందు ఎన్ని శక్తులున్నాయో, అన్నియూ మానవుని హృదయమునందే ఇమిడి ఉన్నాయి. అయితే తన యందున్న ఈ శక్తులను గుర్తించుకొనలేక, బాహ్య జగత్తులో వీటికోసం పరిశీలన జరుపుతున్నాడు మానవుడు. బయట మనకు కనిపించేవన్నీ Reflection of inner being. ఇవన్నీ మనలోపల ఉన్నవాటి

ప్రతిబింబములే. కనుక మానవుడు తన దృష్టిని లోపలకు మరల్చి, విచారణ సలిపి, అంతర్ముఖమైన ఆనందమును బయటకు తెప్పించుకోవాలి.

ఈనాడు కేవలం భౌతికమైన విద్యలకోసనమే మానవుడు కాలమును వ్యర్థంగావిస్తున్నాడు. భౌతిక విద్యలు కూడా అవసరమే. దీని సర్వశక్తులు కూడనూ అంతర్ముఖమైన విద్యయందే యిమిడి ఉంటున్నాయి. అదియే Fundamental Energy ఇది లేకుండా ఏమి చేసిన ఏమి ప్రయోజనం?

ఇది సిల్వర్ టంబ్లర్, ఇది సిల్వర్ ప్లేట్, ఇది సిల్వర్ స్పూన్.... ఇవన్నీ ఎక్కడ నుంచి వచ్చాయి. వీటిని మార్చి వేయవచ్చును. అన్నీ మార్చిన తరువాత మిగిలేదేమిటి? అదియే వెండి (Silver). అది Fundamental One దాని నుండి ఇన్ని రూపములు, ఇన్ని నామములు ఆవిర్భవించాయి. అదే విధముగనే Fundamental Education మన హృదయ స్థానమందున్నది. దీనినే 'ఆత్మవిద్య' అన్నారు. దీనిని చక్కగా పరిశీలించాలి. కనుక భౌతికమైన విద్యయందే మన కాలమును వ్యర్థం గావించకూడదు. ఇలాంటి విద్యను గరిపినవారు మన భారత్‌లో కోట్లమంది ఉన్నారు. వీరి వలన జగత్తుకు కలిగిన ఫలితమేమిటి? వీరు జగత్తుకు ఏమి ఉపకారం చేస్తున్నారు? ఏమీ లేదు. తమ కోసం తాము ప్రాకులాడుతున్నారు. సమాజం కోసం ప్రాకులాడేవారే కనిపించటంలేదు.

"సర్వ లోకహితే రతాః" మనం సమాజ హితం కోసం పనిచేయాలి. ఇది విద్య యొక్క ప్రధాన లక్ష్యం. "సర్వే సమర్థాగుణైః" ప్రతి ఒక్కరూ ఆనందంగా ఉండాలి. ఇది రెండవది. "సర్వే జ్ఞానైక సంపన్నః". సర్వులూ జ్ఞానమును సముపార్జించాలి. ఇది మూడవది. కనుక మనం మొట్టమొదట సమాజం కోసం పాటుపడాలి, సమాజం యొక్క సమృద్ధి కోసం పాటుపడాలి. సమాజం యొక్క సంక్షేమం కోసం పాటుపడాలి. నీవు కూడా ఈ సమాజంలో ఒక వ్యక్తివే. సమాజం యొక్క క్షేమంలోనే నీ క్షేమం కూడా ఇమిడి ఉన్నది. ఈ విషయం ప్రతి ఒక్కరూ గుర్తించాలి.

మనం చదివిన చదువులు ధనం నిమిత్తమై అమ్ముకోరాదు. అయితే ఈనాటి విద్యలన్నీ వ్యాపారాలుగా మారిపోయినాయి. సమాజం నుంచి సంపాదించిన విద్యలు తిరిగి సమాజానికే అమ్ముకోవటమా? ఇది మానవత్వానికి విరుద్ధం. త్యాగం మానవుని ప్రధాన గుణం. దీనినే వేదం "త్యాగేనైక అమృతత్వమానశుః" అన్నది. ఏకత్వాన్ని బోధించింది వేదం. అదే -

"కలసి మెలసి తిరుగుదాం
కలసి మెలసి పెరుగుదాం
కలసి మెలసి తెలుసుకున్న
తెలివిని పోషించుకుందాం
కలసి మెలసి కలత లేక
చెలిమితో జీవించుదాం"

అన్నది వేదం. ఇటువంటి పవిత్రమైన భారతీయ సంస్కృతిని ఆచరణలో పెట్టి, అనుభవించి, ఆనందించి పరులకు అందించాలి.

విద్యార్థులారా !

ఈనాడు మనం చదివే చదువులు ఉద్యోగం కోసమని

## బృందావనంలో వేసవి తరగతులు

బృందావనం (బెంగుళూరు)లో **"భారతీయ సంస్కృతి - ఆధ్యాత్మికత"** అనే అంశంపై విద్యార్థులకు వివరించడానికి ది. 15-5-2000న శ్రీ సత్యసాయికాలేజి ఆడిటోరియంలో **"వేసవి తరగతులు"** ప్రారంభమైనాయి. భగవాన్ సాయి 'జ్యోతి'ని వెలిగించి తరగతులను ప్రారంభించారు. కర్ణాటక గవర్నర్ గా॥ వి.ఎస్. రమాదేవి ముఖ్య అతిధిగా పాల్గొని ప్రసంగించారు. శ్రీ సత్యసాయి విద్యాసంస్థల వైస్ ఛాన్సలర్ శ్రీ గిరి స్వాగతప్రసంగంతో సాయి విద్యా సంస్థల ప్రగతిని, ప్రత్యేకతను, విశిష్టతను తెలియజేసారు. ఈ తరగతులు 15 రోజులపాటు జరుగుతాయి. ప్రతిరోజు ఉదయం కాలేజీ ఆడిటోరియం లో దేశంలోని ప్రముఖ విద్యావేత్తలు వివిధ అంశములపై ప్రసంగాలు చేస్తున్నారు. ప్రతిరోజు సాయంత్రం 'రమేష్ హాల్'లో భగవాన్ సాయి దివ్యోపన్యాసాలు ఏర్పాటు చేయబడినాయి.

గాని, సంపాదనకోసమనిగాని భావించకూడదు. ఈ ఆలోచనే రాకూడదు. ఈనాడు Beggars (బిచ్చగాళ్ళు) కూడా సంపాదిస్తున్నారు. సంపాదన గొప్పదా?

"ధనమె దైవంబయ్యె
దర్పంబె మతమయ్యె
స్వార్థమే బుద్ధికి స్థానమయ్యె
ధర్మంబు వమ్మయ్యె
ధనము హీనంబయ్యె
స్వార్థమే ఫ్యాషనయ్యె"

ఇలాంటి ఫ్యాషన్స్‌లో మనం మునిగిపోతున్నాం. విద్యార్థులారా! స్వార్థాన్ని త్యజించాలి. ఐకమత్యాన్ని **పోషించాలి. ప్రేమతత్త్వాన్ని పెంచాలి. త్యాగభావంతో జీవించాలి.** అప్పుడే సర్వవిధములైన అనుకూలాలు మనకు చేకూరుతాయి. అయితే అనుకూలాల నిమిత్తమై ప్రాకులాడరాదు.

ఆశలకు, నిరాశలకు, దురాశలకు - అన్నిటికి ఏది మూలకారణం? "మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అన్నిటికీ మనస్సే కారణం. ఈ మనస్సు ఎక్కడ ఉన్నది? నాయందున్నదని నీవు భావిస్తున్నావు. "మనోమూలం ఇదం జగత్". మనస్సు జగత్తంతా వ్యాపించి ఉన్నది. ఆ జగత్తంతా వ్యాపించిన మనస్సు, నీ యందు కూడా ఉంటున్నది. దేహములన్నీ బల్బులవంటివి. ఆత్మ శక్తియే కరెంటు. అది అందరియందు ఉంటుంది. అదే విధముగా అందరియందు దైవముంటున్నాడు. "ఈశ్వర స్సర్వభూతానాం". సర్వభూతములయందూ దైవం ఉంటున్నాడు. దానిని మనం ఏవిధంగా అనుభవిస్తున్నాం? "దేహో దేవాలయ ప్రోక్తో జీవోదేవస్సనాతనః" జీవుడే దేవుడు. కాబట్టి ఈ దేహము ఏ విధంగా దేవాలయమో, ఆ దేహమూ అదే విధంగా దేవాలయము. ఈ దేహములన్నియూ దేవాలయములే. ఈ దేవాలయముల యందున్నటువంటి ప్రతి జీవుడూ దేవుడే. కనుక నీవు ఎవర్ని ప్రేమిస్తావు? ఎవర్ని ద్వేషిస్తావు? అన్నీ దేవాలయములే. అన్నింటియందున్నది ఒకే దేవుడే. కాబట్టి దీనిని విశ్వకుటుంబంగా భావించి, అందరినీ నీవు ప్రేమించు. ఎవ్వరినీ ద్వేషించకూడదు. నీవు ఎవరిని ద్వేషించినా, నిన్ను నీవు ద్వేషించుకున్నవాడవవుతావు. కనుకనే Help Ever, Hurt Never అన్నారు. ప్రేమకు మించిన దైవం మరొకటి లేదు. దైవమే ప్రేమ. ప్రేమే దైవము. **Love is God, Live in Love.**

విద్యార్థులారా !

అసూయా, ద్వేషములకు ఏ మాత్రం అవకాశం యివ్వకండి. ప్రేమను పెంచుకోండి.

"Start the Day with Love
Fill the Day with Love
End the Day with Love
This is the Way to God"

కనుక ఇలాంటి ప్రేమతత్త్వాన్ని మనం పెంచుకోవాలి. ప్రతి మానవుడు విద్యవలన 'దయామయుడు'గా మారాలి, దయలేని విద్యవుండి ప్రయోజనం ఏమిటి? శిలా హృదయుడుగా మారకూడదు. విద్య హృదయాన్ని కరిగించాలి. ప్రేమను కదిలించాలి. దివ్యత్వాన్ని పోషించాలి. ప్రతి మానవుణ్ని దయామయుడుగా మార్చాలి. అటువంటి విద్య ఈనాడు అత్యవసరం. డిగ్రీలు కాదు ముఖ్యం.

**"చదివి వ్రాయనేర్చిన వారందరు విద్యావంతులేనా?
కాలేజీలో డిగ్రీలు పొందిన విద్యావంతులగునా?
సుజ్ఞానము సుకృతిలేక విద్యలు సద్విద్యలగునా?
బ్రతుకుటకే విద్యన్న బ్రతుకుటలేదే పశుపక్షులు"**

పశుపక్ష్యాదులు ఏమి చదివినాయి? మన విద్య కేవలం బ్రతకటానికోసం కాదు. Education should be for Life, not for Living. కానీ మనం బ్రతకటానికోసం

ప్రయత్నం చేస్తున్నాం. ఇది చాలా పొరపాటు. ఉద్యోగాల కోసమని ప్రయత్నం చేస్తున్నాం. ఈ ఉద్యోగమునకు, చదువుకు ఉండినటువంటి సన్నిహిత సంబంధబాంధవ్య మును త్రెంచి వేయాలి. అసలు ఏది ఉద్యోగం? ఇంటిపని కూడా ఉద్యోగమే. నీ తల్లిదండ్రులు చేసేటటువంటి పని కూడా నీవు చేయి! తల్లిదండ్రులకు Help చేయి. ఏ పనిచేసినా అది ఉద్యోగమే. "Work will be Transformed into Worship. Work is Worship. Duty is God కనుక నీవు ఏ పనిచేసినా, అది అంతా ఉద్యోగమే. కాని ఈనాటి విద్యార్థులు ఒక డిగ్రీ సంపాదించగానే Pass Port Office కు వెళ్ళుతారు. విదేశాలకు పోవాలి... విదేశాలకు పోవాలి... అదే వారి కోరిక. భారతదేశములో లేనిది, విదేశాలలో ఏమున్నది? భారతదేశములో లేనిది, విదేశాలలో ఎక్కడా లేదు. అయితే మనం భారతదేశములోవున్న పవిత్రతను ఈనాడు మరచిపోతున్నాము. భారతదేశం త్యాగభూమి, యోగభూమి, కర్మభూమి. కాని ఇలాంటి త్యాగభూమి, యోగభూమి, కర్మభూమిని భోగభూమిగా మార్చడానికి ప్రయత్నం చేస్తున్నాం. ఇది భోగముకాదు, మానవునికి అది ఒక రోగమే. కనుక మనం బయట దేశాలకు పోవటానికి ప్రయత్నించకూడదు. నీ దేశాన్ని నీవు సంరక్షించుకో!

"ఇది నాదు మాతృదేశము
ఇది నా ప్రియ మాతృభాష
ఇది నా వృతమంచు
ఎదగొట్టి నుడివనేరని
బ్రతికిన పీనుగొకండు
వసుధన కలడా!"

కనుక మన మాతృదేశమునకు మించినటువంటి దేశం మరొకటిలేదు. ఎంతటి పవిత్రమైన దేశము? అన్ని దేశములకు నాయకత్వం వహించినటువంటిది ఈ భారత దేశము. నైతిక, ఆధ్యాత్మిక, భౌతిక - అన్ని రంగముల యందునూ అగ్రస్థానం వహించినది ఈ భారతదేశము. అంతటి పవిత్రమైనటువంటి ఈ దేశము యొక్క కీర్తిని మీరు ఎందుకు విస్మరిస్తున్నారు? నీవు పుట్టిన దేశముపైననే విశ్వాసం లేకపోతే, పెట్టిన దేశంపైన ఎంతకాలం ఉంటుంది? కనుక ఇది పుట్టిన దేశము. దీనిని నీవు ప్రేమించాలి. ఈ దేశమునకు ఉపకారం చేయాలి. ఈ దేశమునకు మనం సేవ చేయాలి.

విద్యార్థులారా! భౌతిక విద్యలు మీరు చదువవలసిందే. కాని భౌతిక విద్యలతోపాటు, ఆధ్యాత్మిక విద్యలు కూడా అత్యవసరమే. నైతిక, ఆధ్యాత్మిక విద్యలులేనిచోట ఏమాత్రం శాంతి ఉండదు. కనుక ఈ రెండు విద్యలనూ నెగిటివ్, పాజిటివ్‌లుగా భావించుకోవాలి. కాని ఈనాటి విద్యార్థులు హృదయాన్ని పూర్తిగా నెగిటివ్‌గా మార్చు కుంటున్నారు. ఇది కేవలం నిరుపయోగమైనటు వంటిది. ఇది త్రాడుతెగిన గాలిపటము వంటిది. ఇది ఎక్కడపోయి పడిపోతుందో! కనుక దీనిని సరియైన విద్యగా తీర్చిదిద్దు కోవాలి.

విద్యార్థులారా ! మీ గుణం చాలా మంచిదే. మీ

## బృందావనంలో బుద్ధపూర్ణిమ

బృందావనం (బెంగుళూరు)లో బుద్ధపూర్ణిమ ఉత్సవాలు మే 20, 22 తేదీలలో కడు వైభవంగా జరిగినాయి. ఈ ఉత్సవాలలో శ్రీలంక, బర్మా, నేపాల్, థాయ్‌లాండ్, ఇండోనేషియా మొదలగు దేశముల నుండి షుమారు నాల్గువేలమంది బౌద్ధులు పాల్గొనినారు. రమేష్ హాల్ అంతా రకరకాల అలంకారాలతో మెరిసిపోయింది. అందరూ వస్తే, నేనురానా! అన్నట్లుగా చల్లని పిల్లగాలులు వీచి, వారు అందంగా అలంకరించిన కాగితపు బుట్టలు, వివిధ రకములైన తోరణములు ఇటూ, అటూ ఊగుతూ బృందావన ప్రాంగణానికి మరింత శోభను చేకూర్చాయి. ఆ మూడు రోజులు భజనపాటలు వారే పాడి భక్తులను ఆనందపరిచారు. భాష ఏదైనా భావం ఒకటే అన్నట్లుగా వారు చక్కగా గానంచేసి భక్తులను పులకరింపజేశారు. **"బుద్ధుడే సాయి, సాయే బుద్ధుడు"** అనే నమ్మకాన్ని, విశ్వాసాన్నివారు అడుగడుగునా ప్రదర్శించారు. ఆయా దేశాల సాంస్కృతిక ప్రదర్శనలు స్వామి ముందు ప్రదర్శించి భక్తకోటిని ఆనందపరిచారు. 21వ తేదిన జరిగిన బుద్ధపూర్ణిమ సభలో ఆయాదేశాలకు చెందిన కొందరు ప్రముఖులు ప్రసంగిస్తూ బుద్ధుని అవతారమే ఈనాటి సాయి అవతారమని స్పష్టంచేశారు. అనంతరం భగవాన్ సాయి బుద్ధుని గుణగణాలను వివరిస్తూ దివ్యోపన్యాసం చేసి బౌద్ధ భక్తులను తన్మయులను చేశారు.

వయస్సు చాలా పవిత్రమైనటువంటిదే. ఈ వయస్సులో వచ్చే భావములు చాలా పవిత్రమైనవే. కాని తొందరపడ కూడదు. Haste makes Waste, Waste makes Worry. So don't be in a Hurry. తొందరపడి దానిని చాలా దుర్వినియోగం చేసుకుంటున్నావు. ఏదైనా ఆలోచన నీలో రాగానే, ఇది మంచిదా? చెడ్డదా? ఇది సత్యమా? ఇది అసత్యమా? - ఈ విధంగా విచారణ చేయాలి. Discrimination చేయాలి. అది కూడా Individual Discrimination చేయకూడదు. Fundamental Discrimination చేయాలి. నాకు, నీకు, వీరికి, వారికి అందరికి మంచిఏది? అనేది విచారించాలి. అప్పుడే దీనికి సార్ధకత ఏర్పడుతుంది. విద్యార్థులు ఏమాత్రం తొందరపడకుండా, నిదానంగా, సమయం తీసుకొని, పవిత్రమైన యోచనలతో, పవిత్రమైన కర్మలు చేయాలి. ముఖ్యంగా ఎవరిపైన వారికి నమ్మకం ఉండాలి. Self Confidence ఉండాలి. ఈ Self Confidence వలననే Self Satisfaction వస్తుంది. ఈ Self Satisfaction వలననే Self Sacrifice వస్తుంది. ఈ Self Sacrifice వలననే Self Realisation వస్తుంది. Self Confidence - Foundation. Self Satisfaction - Wall. Self Sacrifice - Roof. Self Realisation - Life కప్పులేకుండా ఇంట్లో ఉండగలవా? గోడలు లేకుండా కప్పువేయగలవా? పునాది లేకుండా గోడలు కట్టగలవా? కనుక Self Confidence పునాదివంటిది, మొట్టమొదటిది. అసలు Self అంటే ఎవరు? అదే దైవము.

ఇక్కడవున్న పిల్లలందర్నీ విచారిస్తే ఒకటే సమాధానం వస్తుంది. ఎవరు రామయ్య? అని ప్రశ్నిస్తే 'నేను' అని ఒకడు లేస్తాడు. ఎవరు కృష్ణయ్య? అని ప్రశ్నిస్తే 'నేను' అని మరొకడు లేస్తాడు. ఎవరు రంగయ్య? అని ప్రశ్నిస్తే 'నేను' అని ఇంకొకడు లేస్తాడు. అందరూ 'నేను'... 'నేను' అనే అంటారు. రూపములు, నామములు వేరువేరుగానే ఉంటున్నాయి. కాని అందరినుండి 'నేను...నేను' అనే సమాధానం మాత్రం ఒకటే వస్తున్నది. కాబట్టి మొదట నీ, నీవును తెలుసుకుంటే ప్రపంచాన్నే తెలుసుకున్నవాడ వవుతావు. ఈ ప్రపంచమంతా 'నేను' అనే పదముతోనే నిండివున్నది. దీనినే **'వేదాంతం'** అన్నారు. దీనినే **'అద్వైతము'** అన్నారు. వేదములు ద్వైతములు. వేదాంతం అద్వైతము. **"ఏకం సత్ విప్రా బహుధావదంతి"**. ఎవరి బాధలను చూచి మనసు కరిగిపోతుందో! ఎవరి కష్టము లను చూచి సహాయం చేయాలని బుద్ధి పుడుతుందో! ఎవరి దుఃఖములను చూచి, వాటిని నివారణ చేయాలని అనిపిస్తుందో! అట్టి హృదయం ఉన్నవాడే 'మనిషి'. ఆ మనసులేనివానికే 'దయ' రాదు. కనుక అందరిని చూచి, అందరి బాధలను నివారణ చేయడానికి నీవు ప్రయత్నించాలి.

విద్యార్థులారా! మీరు పెద్ద చదువులు చదవాలని, పెద్ద పెద్ద డిగ్రీలు సంపాదించాలని ఆశిస్తున్నారు. ఎన్నింటిని సంపాదించినప్పటికినీ, ఎన్నింటిని పొందినప్పటికినీ, మాతృదేశము యొక్క సంస్కృతిని మాత్రం మరువకండి. **భిన్నత్వంలోని ఏకత్వాన్ని గుర్తించటమే భారతీయ సంస్కృతి యొక్క విశిష్ఠత.** కాని ఏకత్వాన్ని భిన్నత్వం గావించుట మన సంస్కృతి లక్ష్యంకాదు. పరోపకార నిమిత్తమై మీ చదువులు చదవండి. నీవు నేర్చిన విద్యను జగత్తులో ఏదో ఒక మార్గంలో సద్వినియోగం చేయాలి. ఈనాటి ఇంజనీరింగు, మెడికల్ చదువులు పెద్దవ్యాపారంగా మారిపోయినాయి. ఒక్కొక్క సీటుకు కొన్ని లక్షలు వెచ్చిస్తున్నారు. 20 లక్షలుపైన పెడుతున్నారు కొందరు. ఇంత డబ్బు పెట్టి చదివి నీవు ఏమి చేస్తావు? అంత డబ్బు పెట్టి చదివితే, దానిని తిరిగి సంపాదించడానికి అక్రమ, అనాచార, అవినీతి మార్గములను అనుసరించవలసి వస్తున్నది. డబ్బుపెట్టి చదవకపోయినా ఫరవాలేదు. చాలామంది పిల్లలను పల్లెలలో నీవు ఏమి చేస్తున్నావు నాయనా? అని అడిగితే 'నేను చదువుకొంటున్నాను' అంటారు. చదువుకుంటున్నాను కాదు, చదువుకొంటున్నాను అంటారు. కె.జి. నుండి పి.జి. వరకు అంతా డబ్బుతోనే

## ధర్మవ్యాధోపాఖ్యానము

"వసనస్యేవ ఛిద్రాణి
సాధూనాం వివృణోతియః
అపశ్యన్నాత్మనో దోషాన్
స పాపః ప్రేత్యనశ్యతి"

ఎవడు తన తప్పులను గుర్తించక, ఎల్లప్పుడూ సజ్జనుల దోషాలను వస్త్రంలోని రంధ్రాల మాదిరిగా కొండంతలుగా చేస్తాడో, అట్టిపాపి మరణానంతరం పరలోకంలో దుఃఖాన్ని పొందుతాడు.

ఉన్నది. చదవటానికి డబ్బు పెడుతున్నారు. తిరిగి రాబట్టుకోవడానికి అక్రమమార్గాలను అనుసరిస్తున్నారు. ఇవి ఈనాటి చదువులు.

*విద్యార్థులారా!* భగవంతుడు రెండు చేతులిచ్చాడు మీకు. ఒక పొట్ట మాత్రమే యిచ్చాడు. రెండు చేతులూ పనిచేస్తే, ఆ ఒక పొట్టనిండదా? అయితే చాలామంది ఆ రెండు చేతులతో పనిచేయటంలేదు, పొట్టనిండటంలేదు. పొట్టనింపుకోవటమే లక్ష్యంకారాదు. పశుపక్ష్యాదులు పొట్టనింపుకోవటంలేదా? మొట్టమొదట మనస్సును పవిత్రంగావించుకోండి. మన భావములను పవిత్రమైన మార్గంలో ప్రవేశపెట్టాలి.

ఈ వేసవి తరగతులు యింకా పదిహేను దినములు ఉంటాయి. పిల్లలు నేర్చుకోవలసినవి ఎన్నియో ఉంటాయి. ఇంకా ఎంతోమంది అనుభవజ్ఞులైన స్కాలర్స్ వస్తారు. అనేకమైన అనుభూతులను అందిస్తారు. వారి వారి అనుభవాలను తెలియజేస్తారు. అనుభవాలు చాలా ముఖ్యం. కనుక అట్టి అనుభవాలను అందుకొని, వాటిని ఆచరణలో అందరికి అందించాలి. కనుక ఈ విద్యా విషయం లోపల చాలా జాగ్రత్తగా మెలగాలి. ఈ విద్యను సరీగా అందుకోకపోతే అది అవిద్యగా మారిపోతుంది. ఈనాటి విద్యలు చదివి అన్నీ కృత్రిమ విద్యలుగా ఉంటున్నాయి. ఇలాంటి విద్యలు ఏమి ప్రయోజనము. Education కాదు మనది Educare కావాలి. హృదయము నుండి వచ్చే భావములనే Educare అంటారు. తలనుండి వచ్చే భావములను Education అన్నారు. ఇవన్నీ తలనుండి వస్తుంటాయి, పోతుంటాయి. ఇవి కదిలిపోయే మేఘముల వంటివి. హృదయము నుంచి వచ్చే మానవతావిలువలు శాశ్వతంగా ఉండేటటువంటివి. దయ, ప్రేమ, కరుణ, సహనం, సత్యం - ఇవన్నీ హృదయము నుండి వచ్చేటటు వంటివి. అవి ఏనాటికీ మార్పు చెందవు. ఈనాడు మీరు చదివే చదువులు, చేసే ఉద్యోగాలు అన్నీ ప్రాకృతమైనటు వంటివే. ఇవన్నీ మార్పు చెందేటటువంటివే.

హృత్ + దయ = హృదయము అన్నారు. దయతో కూడినటువంటిది ఈ హృదయము. తల నుండి వచ్చినటువంటివన్ని గాస్టిక్ ట్రబుల్ వంటివి. అంతా తలంపులే.... తలంపులే..... ఈ తలంపులు వచ్చి ఏం ప్రయోజనం? ఇది మంచిది కాదు. హృదయము నుండి ఆవిర్భవించాలి.

"సద్గుణంబులు, సద్విద్య, సత్యనిరతం
కరుణ క్రమశిక్షణ కర్తవ్య పాలనములు
నేర్పునదే విద్య విద్యార్థి నేర్వవలయు"

తెలివితేటలు ఎన్ని ఉండినా ప్రయోజనం లేదు. యుక్తితో వచ్చిన తెలివితేటలు మనకు అక్కరలేదు. హృదయము నుండి వచ్చిన తెలివితేటలు కావాలి. మీ స్నేహితులకు హృదయము నుండి వచ్చిన తెలివితేటలను బోధించండి. ఈ విధంగా సరిఅయినటువంటి విద్యను నేర్చి ఇతరులకు బోధించండి. ఇక్కడ నేర్పేది ఉచిత విద్య.

**విజ్ఞానవాణి - 3**

## మంట పైకే ఉంటుంది ఎందుచేత?

మండడం అంటే ఆక్సిజన్‌తో కలసి దహనం చెందడం శక్తిని విడుదల చెయ్యడం. కొవ్వొత్తి వెలిగిస్తే కొవ్వులోని కార్బన్, హైడ్రోజన్ గాలిలోని ఆక్సిజన్‌తో కలసి కార్బన్-డై-ఆక్సైడు, నీటి ఆవిరి ఏర్పడతాయి. దహనానికి గాలి అవసరం. అందుకే మంట వెలుపలి అంచుల్లోనే దహనం జరుగుతుంది. ఎందుకంటే అక్కడ గాలి అందుబాటులో ఉంటుంది.

తగినంత గాలి అందకపోతే దహనం సంపూర్తిగా జరుగక నల్లని పొగ వస్తుంది. మంట మధ్యభాగంలో ఖాళీగా ఉంటుంది. దహనం వల్ల తయారయిన వాయువులు వేడిగా ఉండి, వ్యాకోచం చెందుతాయి. చుట్టుపక్కల వున్న గాలికన్నా తేలిగ్గా తయారవుతాయి.

తేలిగ్గా ఉండడంవల్ల ఇవి పైకి వెళ్లిపోతాయి. ఒత్తి కింది భాగంలోకి గాలి వచ్చి చేరే అవకాశం కలుగుతుంది. వేడి వాయువులు ఈ విధంగా పైకిపోవడం వల్లనే మంట సాగదీయబడిన ఆకృతిలో పైకి ఉంటుంది. మంట మండే విధానం అంతరిక్షనౌకలో భిన్నంగా ఉంటుంది. ఇచట భూమ్యాకర్షణ శక్తి ఉండదు. అందువల్ల వేడి వాయువులు ఎటూ వెళ్లక ఒత్తి సమీపంలోనే ఉంటాయి. క్రమంగా ఈ వాయువుల పీడనం పెరిగి మంట ఆకృతిని గోళాకారంగా ఉండేటట్లు చేస్తాయి. అంటే మంట బంతి ఆకృతిలా మండుతుంది.

- సి.వి. సర్వేశ్వరశర్మ

కె.జి. మొదలు పి.జి. వరకు ఉచిత విద్య. మేము ఆశించేది ఒక్కటే. మీరు బయటకు పోయి ఆదర్శపురుషులుగా రూపొందాలి. ఆదర్శపౌరులుగా జీవించాలి. బయటకు వెళ్ళి మీ ఆదర్శమును అందరికి ఉచితంగా అందించాలి. ఇక్కడ ఉచితంగా అందుకుని బయటకు వెళ్ళి డబ్బులకు అమ్ముకుంటుంటే ఎంత మోసం? ఇది మంచిది కాదు. ఇది కేవలం వ్యాపారం అయిపోతుంది. ఇలాంటి దానిలో మనం ప్రవేశించకూడదు. ప్రేమతో అందించండి. అందరితో షేర్ చేయండి. ఎలాంటి షేర్? పార్ట్ టైం షేర్ కాదు. Full Time Share చేయండి. ఈవిధంగా చేసినప్పుడే మంచి విద్య మీకు అందుతుంది. మీ అందరికి మన కాలేజి విషయం తెలుసు. 24 గంటలు చదువ కూడదు. కాలేజినుంచి వచ్చిన వెంటనే పుస్తకాలు పుచ్చుకొని కూర్చోరాదు. కాసేపు ఆటలాడాలి. ఏవైనా మంచి పనులు చేయి. కాని 24 గంటలు చదువకూడదు. అంతేగాక ఇంటికి వెళ్ళగానే పుస్తకములు పారవేయకూడదు. నెపోలియన్ లాగే నిద్ర, ఆహారమును అదుపులో పెట్టుకోవాలి. చాలామంది ఇంటికి పోగానే సోమరులై పోతున్నారు. సోమరులు కాకూడదు. Laziness is rust and dust Realisation is Best and Rest సోమరి తనానికి చోటుఇవ్వకండి. అతి వాగుడు మంచిది కాదు. అతిగా వాగడం వలన మన జ్ఞాపక శక్తిని పాడుచేస్తుంది. తెలివితేటలను కూడా పాడుచేస్తుంది. కనుక అతి వాగుడు కూడా మంచిది కాదు. You cannot always oblize, but you can speak always oblizingly. మంచిగా మాట్లాడండి. పెద్దలను గౌరవించండి. తల్లిదండ్రులను ప్రేమించండి. అప్పుడే మీరు మంచి విద్యావంతులౌతారు.

*ప్రేమ స్వరూపులారా!*

మున్ముందు ఈ విషయాలను అంతా మాట్లాడు కుందాం. పశువు తాను తిన్న ఆహారమును తిరిగి తెప్పించు కొని ఏవిధంగా నెమరు వేసుకొని జీర్ణించుకుంటుందో అదే విధంగా మీరు ఇంటికి పోగానే ఇక్కడ విన్న విషయా లన్నింటిని తిరిగి జ్ఞప్తికి తెచ్చుకొని మననం చేసుకొని జీర్ణించు కోండి. ఇక్కడ విన్నటువంటివి Education. జ్ఞప్తికి తెచ్చుకొని మననం చేయడం Educare, కాబట్టి Education ఇక్కడ. Educare ఇంటిలో. అప్పుడే మీకు సరియైన పుష్టి సంతుష్టి ఏర్పడుతుంది.

*(ది. 15-5-2000 బెంగుళూరు బృందావనంలోని సాయి రమేష్ హాల్‌లో భగవాన్ సాయి వేసవి తరగతులను ప్రారంభిస్తూ చేసిన దివ్య ఉపన్యాసం నుండి)*

# పదాల పందిరి - 27

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | * | 2 | * | 3 | 4 |
| | * | 5 | | 6 | * | |
| 7 | | | * | 8 | | |
| * | * | | * | | * | * |
| 9 | | | * | 10 | | 11 |
| | * | 12 | 13 | | * | |
| 14 | | * | | * | 15 | |

ఆధారాలు

**అడ్డం**

1. అడవి, తోట
3. లింకు
5. మౌనముగా ఉన్నస్త్రీయా!
7. ప్రఖ్యాత శతకకర్త
8. మదురు
9. సహాయం, ఒక క్రొత్త టీవీ ఛానెల్
10. వికృతమైన రాక్షసి
12. బంగారములో కలిసేరాగి
14. సాయం సమయం
15. రోగపీడితులు

**నిలువు**

1. తెల్లవారు ఝాము తలక్రిందులైతే
2. ఈయనగారు పట్టుకుంటే ఏడున్నరేళ్లే
4. అల లాంటిది
5. విశ్వబ్దయుద్ధం
6. కంగారు పడటం
9. ప్రియసల్లాపం
11. మిలాకాత్
13. ఆడసింహం

**పదాల పందిరి -26 సమాధానాలు :**

అడ్డం : 1. మనీ 3. లామా 5. అధరం 7. సురభి 8. గుమ్మడి 9. అలుమ్ని 10. కరివం 12. దువుల 14. సెగ 15. హరి

నిలువు : 1. మనసు 2. గాథ 4. మామిడి 5. అభిమన్యుడు 6. రంగులకల 9. అరిసె 11. నండూరి 13. వుహా

# కళాప్రపూర్ణ 'చిలకమర్తి లక్ష్మీనరసింహం'

## (1867–1946)

ఎన్నో గ్రంధాలు పఠించారు, ఎన్నో గ్రంథాలు రచించారు. తన జీవితమే ఒక గ్రంథముగా రూపొందించారు. తెలుగు సాహిత్యానికి, సంఘసంస్కరణో ద్యమానికి, నాటకరంగానికి, చిలకమర్తివారు చేసిన సేవలు అపారం, వారు రచించిన "గయోపాఖ్యాన" నాటకం ప్రజా రంజకమైనది. ఎన్నో నవలలు, నాటకాలు ప్రహసనాలు వ్రాశారు. అందులో 'సౌందర్యతిలక', 'కర్పూరమంజరి' అనే నవలలు ప్రసిద్ధికెక్కాయి. కళాశాలల్లో పాఠ్య గ్రంధాలుగా కూడా ఎన్నుకోబడినవి. వారి ప్రహసనాలు ముఖ్యంగా "గణపతి" అశేషాంధ్రుల మన్ననలు పొందింది. ఆకాశవాణివారు దానిని సీరియల్‌గా ప్రసారం చేస్తే అదివిని ఆనందించని ఆంధ్రుడు ఉండబోడు. గణపతి పాత్ర వారి విశిష్ట రూపకల్పన. వారు రచించిన 'రాజస్థాన కథావళి', 'మహాపురుషుల జీవితాలు' తెలుగునాటి యువకులలో దేశభక్తి ఉత్సాహాలను రేకెత్తించి జాతీయోద్యమానికి విశేషంగా తోడ్పడినవి. కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించిన సంఘ సంస్కరణోద్యమానికి గురుభక్తితో సహాయంగా నిలబడ్డారు. హితకారిణీ సమాజ అధ్యక్షులుగ ఎన్నో సేవలు, ఎన్నో యేండ్లు చేశారు. గాంధీజీ రాజకీయ రంగంలోనికి రాకముందే హరిజన బాలురకు విద్య నిమిత్తమై రామమోహన పాఠశాల నడిపారు. లక్ష్మీ నరసింహం గారు ఆంధ్ర ప్రజాభ్యుదయానికి కృషి చేసిన మహాపురుషులలో ఒకరు.

**జీవిత విశేషాలు :**

| | |
|---|---|
| జననం | : 26 సెప్టెంబరు 1867. |
| మరణం | : 17 జూన్ 1946 - 79సం॥ వయస్సు |
| విద్యాభ్యాసం | : వీరవాసరం (ప.గో. జిల్లా) నరసాపురం, రాజమహేంద్రవరం. |
| గ్రంధరచన | : 1889 నుండి ఇమ్మానేని హనుమంత రావు నాయుడుగారి కోరికపై నాటక రచనలు ప్రారంభం. |
| వివాహం | : 1893 - 26వ ఏట |

ప్రాధమిక పాఠశాలస్థాపన - రాజమహేంద్రవరములో 1899

| | |
|---|---|
| నాటక సమాజ పునరుద్ధరణ | : 1899 |
| ఉన్నత పాఠశాలస్థాపన | : 1903 |
| హితకారిణీ సమాజస్థాపన | : 1906 |
| రామమోహన పాఠశాల స్థాపన | : 1909 |

రచనలు : "దేశమాత" పత్రిక నిర్వహణ, నవల, నాటక, ప్రహసన

| | |
|---|---|
| "కళాప్రపూర్ణ" బిరుదాంకితులగుట | : 1943 |
| నిర్యాణము | : 1946 |

### డా॥ రాపర్ల జనార్ధనరావు

**చిలకమర్తివారి ప్రతిష్ఠాత్మక రచనలు :**

హేమలత, నవ్వులగని వినోదములు, ప్రహసనములు, గణపతి, చమత్కారమంజరి, చిత్రకధాగుచ్ఛము, మణిమంజరి, విష్ణువర్ధనుడు, కృష్ణవేణి, సుధాశరశ్చంద్రము, సౌందర్యతిలక, రామచంద్ర విజయము, కర్పూరమంజరి I, II సువర్ణ గుప్తుడు, రాజరత్నము, అహల్యాబాయి మొదలైనవి.

**బాల్యము, విద్యాభ్యాసము :**

శ్రీచిలకమర్తివారి జననం గోదావరి మండలంలోని ఖండవల్లి గ్రామం, నివాసం వీరవాసరం, రాజమహేంద్ర వరము. వారి స్వీయచరిత్ర నుండియే వీరిని తెలుసు కుందాం. "నేను జన్మము చేత వైదిక బ్రాహ్మణుడను. వైదికులలో మా శాఖ ఆరామద్రావిడ శాఖ. చిలకమర్తి గ్రామము నిజాము రాజ్యములో ఉన్నదని కొందరు చెప్పుదురు. మా తాతగారి నివాస స్థలము గుంటూరులోని మద్దిపాడు. మా నాయనమ్మ మిక్కిలి సాహసురాలు. 1816లో ఉత్తర సర్కారులు దోచుకొనుటకు పిండారి దండు వచ్చియుండెను. జనులు దండునకు దడిసి జొన్నచేలలో దాగికొనిరట. మా ముసలమ్మ ఉన్న చేనులోకి పిండారి దండులో జేరిన యొక సైనికుడు వచ్చెనట. అప్పుడామె రోకలిదీసుకుని యాదురాత్మని పొడవ బోయెనట అంత

వాడు పారిపోయెనట....... ఆమె పుట్టినయూరు అద్దంకి.. చిలకమర్తివారి కాశ్యపస గోత్రులు, అశ్వలాయన సూత్రులు, ఋగ్వేదులు, చిలకమఱ్ఱివారు వైష్ణవులలో గూడా కలరు. వారుకూడా కాశ్యపస గోత్రులే. మాయింటిపేరు చిలకమర్తి వారు, వారియింటి పేరు చిలకమఱ్ఱివారు.". "1832లో కరువు సంభవించినది. ఆ కాలములో వేలకొలది మనుష్యులు మృతి చెందిరి. గుంటూరునుండి రాజ మహేంద్రవరము వరకు గల బాటలు శవములతో నిండి యుండెనని చరిత్రకారులు వ్రాసియుండిరి. మాతాతగారు పేరయ్యగారు సకుటుంబముగా పడమటి గోదావరి జిల్లా మొగలితుర్రు గ్రామము ప్రవేశించిరి. మా పితామహుడు మొగలితుర్రు విడిచి వీరవాసరము గ్రామము జేరెను. మా తాతగారు వీరవాసరములో వైదిక వృత్తివల్ల జీవించిరట. మా పితామహుడు (తాత చిన్న వయస్సులోనే మరణించగా) యా గ్రామముననున్న నియోగుల నాశ్రయించి కుమారుని గడు గారాబముగ బెంచి వృద్ధి లోనికి దెచ్చెను. మా తండ్రిగారి దస్తూరి ముత్యాల కోవ వలె ఉండునని చెప్పుట అతిశయోక్తిగాదు. నేను జదువుకొన్నదీ (వీరవాసరము బోర్డు) పాఠశాలలోనే. మా తండ్రి ఆ గ్రామములో ద్రోణంరాజు, పెద్దాడవారు నను నియోగుల సహవాస మగుట చేత వైదిక వృత్తిమాని లౌక్యవృత్తినే యావజ్జీవము కాలక్షేపము చేసెను.

నా మేనమామగారింట ఇంగ్లీషు తారీఖు ప్రకారము 1867వ సం॥ సెప్టెంబరు నెల 26వ తేదీన ఖండవల్లి గ్రామములో జన్మించితిని. నాది పుబ్బనక్షత్రము, తండ్రి వెంకన్న. వారికి పదిమంది సంతానము. చివరకు 5గురు మిగిల్చారు. లక్ష్మీనరసింహం మూడవవాడు. అంతర్వేదిలో వేంచేసియున్న నరసింహస్వామి వచ్చింది. మాతామహుడు భద్రయ్యశాస్త్రి. "నాకు మాతామహుని పాండిత్యమంత గొప్ప పాండిత్యము లేకపోయినను, రవ్వంత కవిత్వ ధోరణియు, అంధత్వమును సిద్ధించినవి"

**అంధత్వము :**

చిలకమర్తివారు జాత్యంధుడు కాదుగాని దృష్టిలోపమున జీవితాంతము బాధపడినవారు. చివరి దశలో నాటకములు రచింపుమని కోరినవారే, స్వయంగా వారు చిలకమర్తి వద్దకు వచ్చి చిలకమర్తి చెప్పగా నాటకములు వ్రాసికొనెడివారు. అంధత్వము అనుభవించినా, తన నాటక రచనల ద్వారా ఆంధ్ర లోకాన్ని, వెలుగులతో నింపారు. ఈ సందర్భంలో ఆంగ్ల సాహిత్యంలో, మిల్టన్ మహాకవి, అంధుడు, మనకు జ్ఞాపకానికి వస్తాడు. బైబి··· ఇతివృత్తంగా రచించిన ఆయన బృహద్గ్రంథాలు "పారడైజ్ లాస్ట్", "పారడైజ్ లీగెయిండ్" తాను అంధుడుగా ఉండి తన కుమార్తెకు 'డిక్టేట్' చేస్తుంటే వ్రాయబడినవి. చిలకమర్తి దృష్టిలోపపు బాధలు, వారి మాటల్లోనే విందాము. "నాకు జ్ఞాపకము వచ్చిన తరువాత రాత్రులు స్వయముగ నడచుట గాని, చదువుటగాని వీలులేకపోయినది. పగలు కూడ చీకటి లోనున్న వస్తువులు చప్పున కనబడెడివి కావు. పాఠశాలలో నల్లబల్ల మీద వేసిన యంకెలు సులభముగ కనపడెడివి కావు. మిత్రులతో గలసి బంతియాట యాడుచున్నప్పుడు నేను బంతి బట్టుకొనలేకపోయెడివాడను. 1909 సం॥న మనోరమా ముద్రాక్షరశాలకు బోవుచుండగ నొక యావు మీద బడితిని"

**బాల్యవిశేషాలు :**

మేనత్త చామర్తి సుబ్బమ్మ వితంతువుగా మృతి చెంది ఆమె యావదాస్తి చిలకమర్తి వారికి సంక్రమింప జేయగా, పదిమంది సంతానముగల లక్ష్మీ నరసింహం తల్లితండ్రులు కొంత తెప్పరిల్లారు. తండ్రి దస్తూరి బాగుండుటవలన దస్తావేజులు వ్రాస్తూ అమీనా ఉద్యోగం చేశారు. చిన్ననాటి గురువులు సోమంచి సరవయ్యగారు, చెన్నాప్రగడ లక్ష్మీ

## సంస్కారమందించు సత్యసాయి

"సంస్కారమొసరించు సత్య చమత్కార
సారమే శ్రీ సత్యసాయి విభుడు
ప్రేమాయుధము పూని క్షేమాలు కలిగించు
పర్తీశుడే మన బంధువిపుడు
ఇంద్రియాలు మరచి హృదయాలనర్పించు
భక్తులన్ రక్షించు శక్తి యుతుడు
సాయి కార్యము సల్పి శరణాగతిని పొంది
పరమార్ధ సౌధమున్ చేరవలెను
సేవచేయుటె యందు సద్భావ మరసి
దివ్య జీవనానంద సందీప్తినొంది
మేలుగాంతము రండోయి మిత్రులార!
భగవదానంద మొందుటే సుగతి మనకు"

– పంచాంగము శేషప్పశాస్త్రి, పుట్టపర్తి

నరసయ్యగారు. కొన్నాళ్ళు విజయవాడ కొండపల్లిలో చదివి పిదప నరసాపురం మిషన్ స్కూలులో చదివి మెట్రిక్యులేషన్ చదువులకు రాజమహేంద్రవరం చేరారు. పిల్లలకు ప్రైవేట్లు చెప్పుతూ పాఠశాల ఫీజులు చెల్లిస్తూ చదివారు. "తెలుగు, ఇంగ్లీషు భూగోళములోనూ ప్రజ్ఞావంతుడనేగాని గణితములో సమర్థత తక్కువ. ఒకటి అభిరుచి లేకుండుట, రెండవది దృష్టిదోషము. నరసాపురం మిషన్ స్కూలు విద్యాభ్యాసం. తండ్రి పూటకూళ్ళ ఇంట్లో భోజన వసతి ఏర్పాటు చేశారు. "నాకు రోజుకు మూడు పూటలు భోజనము పెట్టుటకు మూడు రూపాయిలు నెలకు పుచ్చుకొనుట కామె సమ్మతించెను. ఆనాడు రూపాయకు నూరు కుంచముల బియ్యము, నెయ్యి వీశెడు మూడుపావులాలు.. అన్ని వస్తువులు మిక్కిలి చౌక" రాజమండ్రిలో మెట్రిక్యులేషన్ పరీక్షలలో లెక్కలు సబ్జక్టులు మార్కులు కావలసినంత రాకపోవటం వలన ప్రైవేట్లు చెప్పి డబ్బు సంపాదిస్తూ పూటకూళ్ళ ఇంటిలో రెండు పూటల భోజనానికి కావలసిన మూడురూపాయలు లేక, ఒంటిపూట ఏర్పాటు చేసి రాత్రి ఒక మినపగారె తిని మంచినీళ్ళు త్రాగి పడుకునేవాడనని స్వీయ చరిత్రలో వ్రాశారు. విక్టోరియారాణి గోల్డెన్ జూబ్లీకి మిత్రుల ప్రోత్సాహం మీద తెలుగులో పద్యాలు వ్రాసి ప్రశంసలు పొందారు.

శ్రీ కందుకూరి వీరేశలింగంగారు వీరికి ఉపాధ్యాయులుగ ఉండటం; వేరొకరు ఏకోశ్వరోపాసనతో బ్రహ్మసమాజంలో పండిత శివనాథ శాస్త్రిగారు వెలివేయబడిన కందుకూరి తదితర ఉపాధ్యాయుల సంశయమువలన శ్రోత్రియ బ్రాహ్మణ వంశజనితుడైన చిలకమర్తి సంఘసేవాతత్పరుడు అయ్యాడు. ఆనాటి బ్రాహ్మణ వితంతువుల శిరోజముండన విధానము మీద వారు వ్రాసిన వాక్యాలు చూడండి. "మన దేశస్థులు అతి ఘోరమైన ఈ శిరోముండనము అను ఆచారమునకు బానిసలైనారు" స్త్రీలకు శిరోముండనము చేయవలసినదని, వేదములందుగాని, మన సంస్కృతియందుగాని, పరాశర స్మృతియందుగాని, ఆపస్తంభుడు, అశ్వలాయనుడోగాని యెక్కడను చెప్పబడి యుండలేదు. ప్రమాణగ్రంధముల యందెక్కడను చెప్పబడని యీ దురాచారము, యీ నీచపద్ధతి, యీ ఘోరకృత్యము యేకాలమునందెవరవ లంబించిరో తెలియదు, దీని వలన ప్రయోజనం లేదు"

ఆ కాలము నాటి ఒక దురాచారము ఇంత ఘాటైన పదజాలములతో చిలకమర్తి ఖండించినారని గమనిస్తే వారీనాడేగనుక సజీవులై ఉండినచో మన సంఘంలోని మరెన్ని దురాచారములను దుయ్యబట్టి ఉండెడివారో గదా! ఇంకొక విషయం దృష్టిలోపమున్నను పైన దెల్పిన ప్రామాణిక గ్రంథములనన్నింటిని వారు చదివి సహేతుకముగ వివరించుట ఒక ఘనత. అటులనే వారి రచనలందు అన్నిటిలోనూ వీరులు, త్యాగశీలురు, దయాళులలైన వ్యక్తుల జీవిత చరిత్రలు మనకు కన్పించుచున్నవి. ఇది కూడా వారి గ్రంథ పఠనమందలి తీవ్ర కృషి మనకు తెలియవచ్చుచున్నది.

**నాటక సమాజములు - శ్రీటంగుటూరి ప్రకాశంగారు :**

"శ్రీ యిమ్మానేని హనుమంతరాయుడుగారు ఆదివెలమ కులస్థులు. మాదిరెడ్డి వెంకటరత్నంగారి బంధువులు. నాయుడుగారు వచ్చునప్పుడు తన ప్రియ శిష్యుడు నాటక సమాజ సభ్యుడు (టంగుటూరి) ప్రకాశం గారిని రాజమహేంద్రవరము దీసికొని వచ్చి పాఠశాలలో జేర్పించిరి. ప్రకాశంగారు బాలుడు, స్ఫురద్రూపి, తెలివిగలవాడు" "నేను వ్రాసినాడు. ఇచ్చిన కీచకవధ నాటకము ప్రయోగించిరి. హనుమంతరావు నాయుడు గారు (బుగ్గ మీసములు, భారీశరీరముగాన) భీమ పాత్ర ధరించిరి. ప్రకాశంగారు ద్రౌపది పాత్ర ధరించిరి" ప్రకాశముగారు నాటకములలో ఏ రసము నభినయించినను మిక్కిలి సొగసుగ నభినయించెడివారు. కరుణ రసమునకు, వీరరసమునకు పేరు పెట్టినదిపేరు. బందరులో పోలీసు యినస్పెక్టరుగా పనిచేసి తరువాత మృతినొందిన వల్లూరి సూర్యప్రకాశరావు గారు హాస్యములో మిగుల గట్టివాడు. చమత్కారముగ ఇంగ్లీషులో నాపేరును గూర్చి Parrot (చిలక) Banyan tree (మఱ్రి) Riches (లక్ష్మి) Manly Lion (నరసింహం) అని పిలిచి నాటక రచయిత నన్ను పరిచయం చేసెడివారు'

పిదప చిలకమర్తి వారు హనుమంతరాయుడుగారి కోర్కెపైన "గయోపాఖ్యానము" వ్రాసి కీర్తి ప్రతిష్ఠులైనారు. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారు, ఈనాటకంలో ఒక అంకములో 'చిత్రలేఖ' స్త్రీ పాత్ర ధరించి, ఐదవ అంశములో అర్జున పాత్ర పోషించి "కన్నుల వైకుంఠముగ ప్రదర్శించెడివారు" ఆనాటి ప్రకాశంగారి మీద చిలకమర్తి వారి ప్రశంసాపూర్వక పద్యం చూడండి. "సీ॥ ఈగవ్రాలిన

గాని వేగజారెడునట్లు యవ్వంపు కురులను దువ్వినాడు.. చెవులనందున గిరజాలు చిందులాడ! మొగము మీదను జిరునవ్వు మొలకలెత్త, టంగుటూరి ప్రకాశము రంగు మెరయ, ధవళగిరి తీర్థమునకును దరలి వచ్చె!"

**రచనావైశిష్ట్యము :**

నవలలు, నాటకములు, చరిత్రలు, ప్రహసనములు రచనలు కోకొల్లలు. వీరేశలింగం, వెంకట్రాయశాస్త్రి, కొక్కొండ, గిడుగు, గురజాడ, పానుగంటి వారి నదీ జలాల్లో తమ రచనలు కలిపి 'ఆంధ్రసాహిత్య వాహినిని పరిపుష్టం చేశారు' గొప్ప ఉపన్యాసకులు, దేశభక్తులు, బిపిన్ చంద్రపాల్ గోదావరి మండల పర్యటనలో సభలో ఆశువుగా పంతులు గారు తెల్పి సభికులను ఉద్రిక్తులనుచేసిన పద్యం చిరస్థాయిగా నిలచింది.

**"భరత ఖండంబు చక్కని పాడియావు, హిందువులు**
**లేగదూడలై యేడ్చుచుండ, తెల్లవారను గడుసరి**
**గొల్లవారు, పితుకుచున్నారు మూతులు బిగియగట్టి"**

**మధురహాస్యము :**

జీవితమున ఎన్ని బాధలున్నను ప్రతివాక్యమునందొక చమత్కృతి జొప్పించుట చిలకమర్తి వారి విశిష్టత. వారి స్వీయ చరిత్రను వ్రాయుమని ప్రోత్సాహించినవారు శ్రీ రాయసము వెంకట శివుడుగారు, శ్రీ విస్సా అప్పారావు గారు. "నా స్వీయచరిత్రను (18-3-1942) నా గుమాస్తా చేత వ్రాయింపనారంభించితిని. వెంకట శివుడుగారు అప్పారావుగారును నాకప్పటి నుండియు నెలకు ముప్పది రూపాయల చొప్పున యిచ్చుచున్నారు. నన్ను స్వీయ చరిత్రను వ్రాయమని నిర్బంధించిన నేరమునకు నేను (వారికి) ధనదండనము విధించినాను.'వారి స్వీయచరిత్ర ఆనాటి కాలమునకు అద్దము పడ్తుంది. ఎన్నో చమత్కారాలు ఉంటవి. కాబోతే ఆనాటి గ్రాంధిక భాష మనము కొంలదిగా సహించాలి.

చమత్కారమంజరి అనే గ్రంధంలో చమత్కారాలు ఉంటవని భావించాను. తీరా చదివితే భార్గవి, భర్తృహరి, వేమన, వేములవాడ, కళింగగంగ, ఖడ్గతిక్కన, తరిగొండ వెంకమాంబ, రాయని భాస్కరుడు, రుద్రమదేవి, కౌశికుడు, త్యాగరాజు, మొదలుకొని సోక్రటీస్ వరకు చక్కని శైలిలో అతి సూక్ష్మరీతిని జీవిత చిత్రాలు రూపొందించారు. మరి చమత్కార అనే పదం ఎందుకు ప్రయోగించారు అని ఆలోచిస్తే మహాత్ముల జీవితాలలోని కొన్ని చమత్కారాలు ఉదహరించారు గనుక.

**కొసమెరుపు ప్రకాశంగారి కోర్కె: పకోడీ మీద పద్యాలు :**

నాటక సమాజ సభ్యులందరూ పకోడీలు తింటున్నారట. ప్రకాశంగారు చిలకమర్తివారిని పకోడీలమీద పద్యాలు చెప్పమన్నారుట. ఆశువుగా చెప్పిన పద్యాలు ఒకటిరెండు స్థల విస్తృత భీతి చొప్పున ఉదహరిస్తాను.

**"కం"వనితల పలుకులయందున, ననిమిషలోకమున నున్న దమృత మంటంచున్, జనులనుదటెగాని, లేదట, కనుగొన నీయంద మృతము గలదు, పకోడీ" ఎందుకు పరమాన్నంబులు, ఎందుకు పలు పిండి వంటలెల్లను హా! నీ ముందర దిగదుడుపున కవియందును సందియము గలుగదరయ, పకోడీ!" "ఆరామానుజుడాగతి, పోరున మూర్ఛిల్ల దెచ్చె మును సంజీవిన్, మారుతి యెరుగడుగాక, యయ్యారె నినుగొనిన బ్రతుకడటవె, పకోడీ!!"**

ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు 1943లో వీరి సాహితీ సేవలు గుర్తించి "కళాప్రపూర్ణ" బిరుదొసంగి గౌరవించారు. 1946లో చిలకమర్తి దివికేగినాడు.

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి వాక్యాలు వారి దృష్టి లోపం గోర్చినవి, చిరస్మరణీయాలు "ప్రజ్ఞానిధులైన వారికి జ్ఞాన చక్షువులుండగా చర్మచక్షువులతో అక్కరలేదు గదా'

**ఆంధ్రజనని**

"ఆంధ్ర మహాభారతామ్నాయము కవిత్ర
యంబు కూరిచెఁగిరీటంబుగాగ
నన్నెచోడఁడు సోమనాధుఁడు తమ కృతుల్
చెవ్వాకు తొడవులు సేసియొసగె
శ్రీనాధ పోతనల్ శివవిష్ణుమయకావ్య
భూషలనిడె బాహుపురులు కాగ
అల్లసాని ప్రముఖాష్టదిగ్గజకవుల్
అమరించె కృతి కంఠహారవితతి
యెందఱెందరో రసయుక్త సుందరపద
మంజుల ప్రబంధమణిహేమాభరణము
లంద మొందింప శోభతోనలరుజనని
ఆంధ్ర భాషామతల్లికీ నంజలింతు"

**- పృధివి సుబ్బనాగయ్య కవి**, మచిలీపట్నం

# అంతరంగ తరంగాలు

(స్వామితో ఇంటర్వ్యూలు - ఇన్నర్వ్యూలు)

మరొక ఇంటర్వ్యూలో బాబా ఎంతో అనుగ్రహ పూర్వకంగా ఒక పెద్ద కలకండ ముక్కను సృష్టించి, గొంతు తడి ఆరిపోయి బాధపడుతున్న మా తండ్రిగారికిచ్చి తినుమని చెప్పారు. తరువాత ప్రశాంతి నిలయములో ఎలా ఉన్నదని మానాన్నగారిని అడిగారు. దానికి ఆయన బాబా యొక్క ప్రేమ పూర్వకమైన దివ్య సన్నిధిలో తాను చాలా ప్రశాంతముగా రోజులు గడుపుతున్నానని సమాధానము చెప్పారు. పేరుకు తగినట్టుగా ఈ ప్రదేశము నిజంగా ప్రశాంతి నిలయమే! అప్పుడు బాబా, ఒక్కొక్కప్పుడు బయటినుండి వచ్చేవారికి ఇక్కడి వాతావరణమంతా మతి స్థిమితము లేనివారితో నిండి ఉన్నదనిపిస్తుందని చెప్పారు. వీళ్ళు తాము తప్ప ఇతరులంతా పిచ్చివాళ్ళనుకునే పిచ్చివాళ్ళు!

మానసికంగా క్రుంగిపోయిన ఒక గృహిణిని గురించి చెపుతూ ఆమె తన భర్తయొక్క కఠినమైన ప్రవర్తన వలన, భార్యాభర్తల మధ్య ప్రేమ, హృదయపూర్వక సహకారము లేకపోవడం వలన, ఆ స్థితికి వచ్చిందని స్వామి చెప్పారు. తరువాత ఆయన నా కళ్ళలోనికి గుచ్చి గుచ్చి చూస్తూ నా భార్య విషయంలో అలా కాదనీ, విదేశాలలో ఇంట్లో సహాయం చేసేవారెవరూ లేక, భర్త తరుచుగా ఉద్యోగరీత్యా బయటికి వెళుతున్నప్పటికి అటువంటి పరిస్థితులలో కూడా అయిదుగురు కుమారులను కని ప్రేమతో పెంచి పెద్దచేసి సుఖశాంతులు, ఆనందముతో నిండిన గృహమును నడిపిందని చెప్పారు.

తరువాత ఇంటర్వ్యూను కొనసాగిస్తూ మా భార్యా భర్తలు ఇద్దరం మా తండ్రిగారి సంరక్షణ విషయంలో ఎటు వంటి లోపం చేయడంలేదని స్వామి చెప్పారు. సరియైన సమయంలో స్వామి నాకిచ్చిన స్పష్టమైన ఆదేశము వలననే న్యూయార్క్‌లో ఐక్యరాజ్యసమితిలో 34 సంవత్సరాలు ఉద్యోగము చేసిన నేను ఇంధనశాఖాధిపతిగా పదవీ విరమణ కాలము ముగియకుండానే ఉద్యోగము నుండి విరమించుకుని మా తండ్రిగారికి సేవ చేసుకోడానికి తిరిగి వచ్చానని నాకు బాగా తెలుసునని అన్నారు స్వామి. అప్పుడు నేను "స్వామీ! నిస్సంశయముగా మీరే నేను, నాభార్య ఆలస్యంగానైనా పితృఋణము తీర్చుకునేటట్లు చేశారు" అని ఆయనతో చెప్పాను. అందుకు స్వామి నా శిరస్సుపై తమ దివ్య హస్తమునుంచి ఆశీర్వదించారు. ఆ సమయంలో నా హృదయాంతరాళములలో ఏదో అనిర్వచనీయమైన దివ్యానుభూతి, ఆనందము వెల్లివిరిశాయి. ఆ తరువాత, సంవత్సరాలు గడుస్తున్నకొద్దీ స్వామి మాకు ఎన్నో అటువంటి దివ్యానుభూతులను ప్రసాదించి అనుగ్రహించారు.

**ఘండికోట వెంకట సుబ్బారావు**

## 11. గాయత్రీ మంత్రము

మరొక సంవత్సరం శివరాత్రి పర్వదినమునాడు స్వామి సంధ్యావందనము గురించి తెలుగులో వ్రాయబడిన ఒక పుస్తకము నా చేతిలో ఉండడం చూచి ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం మూడుసార్లు ప్రతి రోజూ గాయత్రి మంత్రమును జపిస్తూ, ఆ మంత్రమునే ధ్యానిస్తూ సంధ్యావందనము చేయాలని సెలవిచ్చారు. క్షణక్షణము నకు మార్పు చెందే వస్తు ప్రపంచమునకు, మార్పులేని నిత్య సత్యమునకు మధ్యగల భేదమును గమనించే విజ్ఞానమును అభివృద్ధి చేసుకోవాలని ఆయన సూచించారు. వేదముల లోని ప్రతి అక్షరము, ప్రతి స్వరము ధ్యానమునకు అనువైన పవిత్రమంత్రములే, అని స్వామి ఈ సందర్భముగా నాకు బోధపరచారు.

స్వామి చెప్పిన ఈ మాటలు విని నేను ప్రతిరోజూ క్రమం తప్పకుండా శ్రీసత్యసాయి గాయత్రి మంత్రమును మనసులో జపిస్తూ త్రికాలములందు సంధ్యావందనమును కొనసాగిస్తున్నాను. దివ్య తేజస్సుతో విరాజిల్లే సర్వదేవతా స్వరూపులైన భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారిని జగన్మాతయైన గాయత్రి మాతగా భావించి ధ్యానించడం నేను నేర్చుకున్నాను. పూజ్యులు, సుప్రసిద్ధ వేదపండితులు అయిన శ్రీ ఘండికోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

శ్రీ సత్యసాయి గాయత్రి మంత్రమును వెల్లడించిన మరునాడు, అంటే, క్రిస్మస్ పర్వదినమునాడు బాబా మా కుటుంబమునకు మరొక ఇంటర్వ్యూ ప్రసాదించి మమ్మల్ని మహోన్నతమైన ఆధ్యాత్మిక శిఖరములకు తీసికొని వెళ్ళారు.

## 12. వియన్నాలో "గర్భసంచీ నీరు" నింపుట

స్వామి మరొకసారి మాకు ఇంటర్వ్యూ ఇచ్చి మా రెండవ కుమారుని, కోడలిని ఆశీర్వదిస్తూ, వారికి మూడవసారి ఒక కొడుకు పుడతాడని సంవత్సరం ముందుగా చెప్పారు. అప్పటికి వాళ్ళకిద్దరు ఆడపిల్లలు. వాళ్ళకి "సాయిసునేత్రి" మరియు "శివమాల" అని స్వామియే నామకరణం చేశారు. మూడవసారి అప్పటికింకా మా కోడలు గర్భవతి కాలేదు. ఈ ఇంటర్వ్యూ జరిగిన కొన్నాళ్ళ తరువాత వియన్నాలో ఉంటున్న మా కోడలు గర్భవతి అయిందని మాకు కబురు తెలిసింది.

కొన్నినెలల తరువాత, ప్రశాంతి మందిరములో వరండాలో కూర్చున్న నావద్దకు స్వామి నడిచి వచ్చి "నేను బేగ్ నింపుతున్నాను", అని క్లుప్తంగా రెండు మాటలు చెప్పి వెళ్ళిపోయారు. అప్పట్లో ఆ మాటలు యొక్క అర్ధము నేను గ్రహించలేకపోయాను. అదే రోజు రాత్రి మా రెండవ కుమారుడు వియన్నా నుండి ఫోను చేసి తన భార్య ఆరోగ్యము ఏమీ బాగా లేదనీ, ఆమె యొక్క "వాటర్ బేగ్" (బిడ్డసంచీ) అపరిపక్వదశలో పగిలిందనీ, ఆమెను వెంటనే హాస్పిటల్లో చేరుస్తున్నామనీ చెప్పాడు.

బహుశా ఆ పరిస్థితి ఎలా ఉందంటే ఆ వాటర్‌బేగ్ ధారాపాతంగా కారిపోతూంటే, దానితో బాటే ఆమె హాస్పిటలులో ఉండే సమయం కూడా పెరిగిపోతోంది. ఒక ప్రక్క ఆఫీసు పనులు చూసుకోవడం, మరొక ప్రక్క ఇద్దరు ఆడపిల్లలకు సంరక్షణ చేయడం, ఇంకొక ప్రక్క ఇంటి పనులు చూసుకోవడం - ఇవన్నీ మా అబ్బాయి ఒక్కడే చేసుకోవడం చాలా కష్టంగా ఉంది. ఈ పరిస్థితిలో నేను నా భార్య సహజంగానే చాలా ఆందోళన చెందాము. కాని, బాబా మాపై తమ దివ్యానుగ్రహమును వర్షిస్తూ మేము ఆందోళన చెందవలసిన పనిలేదని, తాను నిరంతరాయంగా ఆ "వాటర్ బేగ్"ను నింపుతూనే ఉన్నానని, దానితోబాటే పిల్లల సంరక్షణాభారం కూడా వహిస్తున్నానని మాకు అభయమిచ్చారు.

తరువాత ఏప్రిల్ నెలలో మేము బాబాతోపాటు కొడైకెనాల్ వెళ్ళాము. ఆ సమయంలో ఆయన తరుచు మా వద్దకు వచ్చి గర్భిణిగా ఉన్న మా కోడలు క్షేమంగా ఉన్నదని, బిడ్డ పెరుగుదల సక్రమంగా ఉన్నదని మాకు ధైర్యము చెప్పేవారు. అంతేకాక, ఈ విషయమంతా తాను స్వయంగా చూచుకుంటున్నానని, మేము వియన్నా వెళ్ళవలసిన అవసరం లేదనికూడా ధైర్యం చెప్పారు. తాను స్వయంగా తల్లికి ప్రాణ రక్షణ, పుట్టబోయే బిడ్డ విషయంలో గర్భ రక్షణ, వీటితోబాటే మా మనుమరాళ్ళిద్దరికీ వత్సరక్షణ కల్పిస్తున్నందువలన మా దంపతులు ఇద్దరం పూర్తిగా ధైర్యంగా, విశ్రాంతిగా, ఆనందంగా తమ దివ్య సన్నిధిలో కాలము గడుపవచ్చని స్వామి అభయమిచ్చారు. నిజమే మరి! సాయి రక్షకుడై, సంరక్షకుడై, ప్రాణదాతగా నిలిచినప్పుడు మాకు ఆందోళన ఎందుకు? తరువాత ఒక రోజున, బాబాయే స్వయంగా మాకు మనుమడు పుట్టిన శుభవార్త తెలియజేశారు. అదే రోజున ఆయన ఆ కుర్రవానికి మా పెద్దకుమారుని కొడుకులిద్దరి పేర్లతో ("జయవర్ధన్" మరియు "ఆర్యవర్ధన్") సరిపోయేటట్లుగా "హర్షవర్ధన్" అని పేరుపెట్టారు.

ఈ సందర్భంగా నేనొక విషయం చెప్పాలి. వియన్నాలో మా కోడలు గర్భిణిగా ఉన్నప్పుడు ఆమె ఆరోగ్యమును పరీక్షిస్తున్న డాక్టర్లు ఆమె గర్భసంచి నుండి ధారాపాతంగా ద్రవిస్తున్నప్పటికీ లోపల బిడ్డ మాత్రం సక్రమంగా పెరుగుతూండడం గమనించి చాలా ఆశ్చర్యపోయారు. అంతే కాదు, బిడ్డ పెరుగుదల ఎప్పటికప్పుడు గమనిస్తున్న డాక్టర్లు చివరి వరకు ఆడపిల్లే పుడుతుందని నిర్ధారించారు. చివరకు, రెండు నెలలపాటు హాస్పిటలులో డాక్టర్ల యొక్క ప్రత్యేక సంరక్షణలో గడిపిన తరువాత బాబా ముందుగానే చెప్పినట్లు కొడుకు పుట్టాడనే వార్త మా కుమారునికి, మా కోడలికి, మాకు కూడా అత్యంత ఆనందదాయకమైన, ఆశ్చర్యకరమైన విషయం. కొడైకెనాల్‌లో ఒకరోజున స్వామి మా దగ్గరకు వచ్చి "స్వీట్లు ఏవీ" అని పరిహాసమాడారు. నాకు అర్థం కాలేదు. కాని, ఆయనే మళ్ళీ, మాకు మనుమడు పుట్టాడని వాడికి తానే "హర్షవర్ధన్" అని పేరు పెట్టానని చెప్పారు. వాడి తల్లి తండ్రులకు, మా కుటుంబ మంతటికి ఇది అత్యంత ఆనందదాయకమైన శుభవార్త. ముఖ్యంగా అంత బాధ అనుభవించిన తరువాత బాబా పదేపదే ఉద్ఘాటిస్తున్నట్లు బాధ, ఆనందము, సుఖ దుఃఖములు, శీతోష్ణములు, ఇవి వరుసగా వచ్చి పోతూండేవి, కలకాలం నిలిచేవికావు.



# గురువారం - గురుదేవులు



గురువారం: ఈవారం పేరులోనే 'గురు' శబ్దం ఉన్నది. గురువు అనగా ఒక మంచి మార్గమును చూపించి మానవుని మాధవునిగా తీర్చిదిద్ది ఒక ఉన్నతమైన స్థితికి తీసుకొని వెళ్ళేవాడు. అటువంటివారినే 'గురుర్బ్రహ్మా, గురుర్విష్ణుః, గురుర్దేవోమహేశ్వరః' అని అంటారు. గురువారం ఎందరో మహానుభావులకు ఇష్టమయిన, ప్రీతికరమైన రోజు. గురువారాన్ని లక్ష్మివారమని కూడా అంటారు.

## శ్రీ రాఘవేంద్రస్వామి

"పూజ్యాయ రాఘవేంద్రాయ సత్యధర్మరతాయచ
భజతాం కల్పవృక్షాయ నమతాం కామధేనవే"

తుంగభద్రా నదీతీరంలో మంత్రాలయము అను మహాపుణ్యక్షేత్రమున్నది. అక్కడనే మహాయతేంద్రులయిన శ్రీ రాఘవేంద్రస్వామి సమాధి మందిరం ఉన్నది. శ్రీ రాఘవేంద్రులు గొప్ప వైణిక విద్వాంసులు, పరమశాంత మూర్తులు. వారు అనేక గ్రంధములను రచించారు. మరి కొన్నింటికి అనువాదం చేశారు. వారు తమ జీవిత కాలంలోనే కాక సమాధి చెందిన తరువాత కూడా తనను నమ్మినవారిని దయతో కాపాడుతూ ఉన్నారు. కొలిచిన వారికి కొంగు బంగారమైనటువంటి శ్రీరాఘవేంద్రస్వామికి ప్రీతికరమైన రోజు గురువారము. శ్రీరాఘవేంద్రుని భక్తులు గురువారం నాడు భక్తితో ఆ స్వామిని పూజించి సర్వాభీష్టములను పొందుతున్నారు.

## శ్రీ షిరిడీ సాయిబాబా

"ఓం సాయి శ్రీసాయి జయజయసాయి
సాయి సాయి షిరిడి మాయిమాయి ద్వారకామాయి"

పవిత్రమయిన షిరిడీలో వెలసిన సమర్ధ సద్గురు సాయి బాబావారికి గురువారం చాలా ప్రీతికరమైన రోజు. "సర్వజీవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" అన్నదానికి సరియైన అర్ధం చెప్పారు శ్రీ షిరిడీసాయి. అహంకారము, అభిమానమును వదిలితే అంతా ఆనందమే అన్న సత్యాన్ని ఆచరించి చూపించారు శ్రీ సాయిబాబా. తనను చేరవచ్చిన వారినందరిని అమ్మా! అన్నా! అక్కా! అని ప్రేమతో ఆప్యాయతతో పలుకరించేవారు. హిందూ ముస్లిమ్ సమైక్యతకు శ్రీ సాయిబాబావారు ఎంతో కృషి చేసి విజయాన్ని సాధించారు. శ్రీ సాయిని కులమత బేధాలు లేకుండా అందరూ కొలుస్తారు. ఈనాడు ఒక్క షిరిడీలోనే కాక పట్టణాలలోను, పల్లెలలోను వాడవాడలా శ్రీ షిరిడీసాయి మందిరాలు వెలిశాయి. సాయీ! అని పిలుస్తే! ఓయీ! అని పలికే శ్రీ షిరిడీ సాయికి గురువారం చాలా ఇష్టమయినది. కనుక వారి భక్తులు కూడా గురువారమును అత్యంత పవిత్రదినముగా భావిస్తారు.

**కొమరగిరి జయప్రద**

## భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

"నిర్మల హృదయ విరాజిత చరణం
సత్యసాయీ చరణం ప్రణమామ్యహం"

పరమ పవిత్రమైన రత్నాకరవంశంలో, భారద్వాజ గోత్రంలో, కుగ్రామమైన పుట్టపర్తిలో 1926 నవంబరు 23వ తేదీన ఒక దివ్యపురుషుడు ఉద్భవించారు. వారే శ్రీ సత్యనారాయణరాజు. బాల్యమునందే, ఒకరోజున వారు "నా భక్తులు నన్ను పిలుస్తున్నారు. నాకు ఏ సంబంధ బాంధవ్యాలూ లేవు. దీనజనోద్ధరణే నా ముఖ్య కర్తవ్యం. నేను మీవాడను కాను "నేను సాయిబాబాను" అని తమ యొక్క దివ్యమైన అవతార ప్రకటన చేశారు. ఆ పరమ పవిత్రమైన పుణ్యదినమే గురువారము. అందువలన శ్రీ సాయిబాబావారి భక్తులకు గురువారం చాలా పవిత్రమైన రోజు. సత్యధర్మశాంతి ప్రేమ అహింసలు మానవత్వానికి పంచప్రాణములు వంటివని తమ ప్రసంగములలో స్వామి తరచుగా చెబుతుంటారు. సర్వమత సమన్వయాన్ని ప్రపంచవ్యాప్తంగా సాధించాలని భగవాన్ శ్రీసత్యసాయి బాబావారి సంకల్పం. ఒక్క ఆధ్యాత్మిక రంగమునకే పరిమితంకాక విద్యా, వైద్య, సేవారంగాలలో కూడా

విశేషమైన కృషిని కొనసాగించటం భగవాన్ బాబావారి ప్రత్యేకత, ఈనాడు ఎంతోమంది దేశవిదేశములవారు తమకున్న అశాంతిని పోగొట్టి ప్రశాంతిని, శాంతిని ప్రసాదించే ప్రశాంతి నిలయాన్ని చేరుకుంటున్నారు. మాతాపితగురుదైవము అన్నీ తానే అయిన శ్రీ సత్యసాయి బాబావారికి గురువారము చాలా ప్రీతికరమైన రోజు.

పైన చెప్పుకున్న ముగ్గురు గురుదేవులకు కూడా గురువారం చాలా ముఖ్యమయిన రోజు కావటం విశేషం. కాబట్టి అటువంటి పుణ్యమయిన, పవిత్రమయిన గురువారంనాడు ఆ గురుదేవులను ధ్యానించి, పూజించి వారు చెప్పినవి ఆచరించి మన జన్మను సార్థకం చేసుకుందాము. ⌗

**మహిళావాణి**

# దురాశ దుఃఖమును తెచ్చిపెడుతుంది

"ఇచ్ఛతి శతీ సహస్రహం
సహస్రీ లక్ష మీహతే:
లక్షాధిప స్తథా రాజ్యం
రాజ్యస్థః స్వర్గ మీహతే"

ధనాశకు మితమంటూలేదు. నూరు రూపాయిలున్న వాడు వెయ్యిరూపాయిలు కావాలని కోరుతాడు. వెయ్యి వున్నవాడు లక్ష కావాలంటాడు. లక్ష ఉన్నవాడు కోటీశ్వరుడు కావాలని, లేదా రాజ్యమంతా తనకే రావాలని కోరుకుంటాడు. పెద్దరాజ్యానికి రాజైనవాడు కూడా స్వర్గలోక ఆధిపత్యం కూడా తనకే కావాలని ఆశ పడతాడు.

కాబట్టి అలా ఆశకు అంతులేదు. దానికి తృప్తి అనేది లేదు. తృప్తి ఎప్పుడైతే లేదో అప్పుడు మనిషికి సుఖం లేదు. అందుచేత ఆశకుపోక ఉన్నదాంతో తృప్తి పడితేనే మనిషికి సుఖం.

"ఆస పాపజాతి యన్నిటి కంటెను
ఆసచేతయతులు మోసపోరె
చూచి విడచువారు శుద్ధాత్ములెందైన
విశ్వదాభిరామ వినురవేమ."

అన్నాడు వేమన. అన్నింటియందును ఆశ మిగుల దోషముగలది. దానిచేత యోగులుగూడ మోసపోయినారు. కావున దానినెరింగి విడుచువారు బుద్ధిమంతులు.

ఆశకు అంతులేదు, మనిషికి తృప్తిలేదు. ఆశపోతు మంచిచెడులను గురించి ఆలోచించడు. పుణ్యాపాపముల సంగతి పట్టించుకోడు. ఎంతధనమున్నా ఇంకా...ఇంకా... కావాలని ఆశిస్తుంటాడు. దీనికి అంతులేదు. ఆశ మితి మీరితే అది దురాశగా మారుతుంది. "దురాశ దుఃఖమును తెచ్చిపెడుతుంది". అయితే 'ఆశ' అనేది కూడా ప్రతి మనిషికి ఉండవలసినదే. అసలు ఆశే లేకపోతే మానవునికి మనుగడే ఉండదు. 'మానవుడు ఆశాజీవిగదా!" కానీ, ఆశకు మితం, మనిషికి తృప్తి ఉండాలి. అదిలేకపోతే, ఆశ అత్యాశగా మారి, చివరకు దురాశగా రూపొందుతుంది. అప్పుడు మానవుడు పతనమవుతాడు.

పాముకాటునుండి పరీక్షిత్తును రక్షించి ప్రతిఫలంగా ధనమును పొందాలని ఆశించి బయలుదేరిన బ్రాహ్మణుడు, దారిలోనే సర్పరాజు అయిన తక్షకుడు కలిసి, ఆశించిన దానికన్నా ఎక్కువ ధనం యిస్తానని ఆశ చూపటం వలన, తాను వచ్చిన కార్యమును మరచి, ఆ ధనమును తీసుకొని వెనుకకు తిరిగిపోయినాడు ఆ బ్రాహ్మణుడు. ఆ సమయంలో ఆశించిన దానికన్నా ఎక్కువగా లభించినదని ఆశపడ్డాడేగాని, రాజు యొక్క క్షేమాన్నిగాని, రాజ్యం యొక్క శ్రేయస్సునుగాని అతను ఆలోచించలేకపోయినాడు. కాబట్టి ఎంతటి వారైనా ఆశకు దాసులై తన కర్తవ్యాన్ని కూడా విస్మరిస్తారు.

కాబట్టి దురాశకు లోనుకాకుండా, ఉన్నదానితోనే తృప్తి చెందటం బుద్ధిమంతుల లక్షణం.

**- సాయిప్రియ**

**చందాదారులకు మనవి**

**చందా పంపేటప్పుడు తమది క్రొత్త చందా? లేక పాత చందా? వివరంగా తెలియపరచండి. పాతచందా అయితే చందా నెంబరు తెలియజేయండి. M.O. కూపన్ మీద తమ చిరునామాను వివరంగా వ్రాయండి. అశ్రద్ధ చేయకండి.**

# టాలెంట్ టెస్టులు విద్యార్థుల మేథాశక్తికి పదునుపెడుతాయి

'Education is for Life and not for Living' జీవితానికి విద్యకావాలి, జీవించటానికి కాదు. విద్యను అభ్యసించడం ఉద్యోగం కోసం కాదు. ధనసంపాదనకంతకన్నా కాదు. విద్య యొక్క అసలైన ప్రయోజనం విజ్ఞానాన్ని సముపార్జించటం. అయితే ఈనాడు అధ్యాపకులు, తల్లిదండ్రులు మార్కులకు ప్రాధాన్యత యిస్తున్నారు. మార్కులు బాగానే వస్తున్నాయి. గోల్డుమెడల్స్ కూడా సంపాదిస్తునే వున్నారు. కాని సద్గుణాలు తరిగిపోతున్నాయి.

"నేటి విద్య తెలివితేటలనే పెంచు
కొంచమైన గుణము పెంచబోదు
కోటి విద్యలుండి గుణము లేకున్నచో
అట్టి విద్యకన్న మట్టి మిన్న"

అన్న భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి మాటలలో ఎంతో వాస్తవం వున్నది. తెలివితేటలతో పాటు గుణం కూడా పెరగాలి. గుణహీనుడు గొప్ప మేధావి అయినా ప్రయోజనం లేదు. గుణహీనుడు ఏరంగంలో ప్రవేశించినా ప్రకాశించడు ప్రకాశించకపోగా ప్రమాదం కూడా తెచ్చి పెడుతాడు. కనుక ప్రతి విద్యార్థి విద్యార్జనతోపాటు గుణార్జన కూడా చేయాలి. అందువలననే The end of is Character అన్నారు బాబా.

కనుక విద్యార్థులు విద్యతోపాటు వినయం, చదువుతో పాటు సంస్కారమును పెంచుకోవాలి. విద్యా వినయ సంపన్నులు కావాలి, శీలంలేనివాడు ఎంతమేధావి అయినా ప్రయోజనం లేదు. శీలం గనుక లేకపోతే కష్టించి సముపార్జించినదంతా కోల్పోతాడు. దేనిని కోల్పోయినా నష్టం లేదుగాని, శీలాన్ని కనుక కోల్పోతే మాత్రం సర్వస్వాన్ని కోల్పోయిన వాడవుతాడు. If Wealth is lost nothing is lost, If health is lost something is lost, If character is lost every thing is lost అనే సత్యాన్ని ఎవరూ విస్మరించరాదు.

కేవలం విద్య విజ్ఞానాదుల చేతనే సంతృప్తి చెందరాదు. ఈనాడు Bookish Knowledge మాత్రం పెరిగి పోతున్నది. అనుభవజ్ఞానం అసలే ఉండటంలేదు. వివేకం పెరగటంలేదు. విచక్షణా జ్ఞానం బొత్తిగా ఉండటంలేదు. అనుభవంలేని జ్ఞానం ఉన్నా ప్రయోజనం లేదు. వివేకం లేని విజ్ఞానం వినాశనానికి దారి తీస్తుంది. విచక్షణ లేని జ్ఞానం ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది. విజ్ఞానం లేని విద్య రాణించదు. అనుభవంలేని చదువు, వివేకం లేని విజ్ఞానం, లౌకికం లేని మనిషి, విచక్షణ లేనిపని, విజ్ఞతలేని పాండిత్యం, శీలంలేని మనిషి, వినయంలేని విద్యార్థి, భక్తిలేని పూజలు వలన ప్రయోజనం లేదు. పుస్తక జన్యజ్ఞానంతోపాటు అనుభవజ్ఞానమును, ప్రపంచజ్ఞానమును ప్రతి ఒక్కరూ సంపాదించితీరాలి. ఈ ప్రపంచజ్ఞానము (Worldly Knowledge) ను సంపాదించడానికి ఈ Talent test లు ఎంతగానో విద్యార్థులకు ఉపకరిస్తాయి. విద్యార్థులలో ఉన్న మేధాశక్తికి పదును పెట్టబడుతుంది. ఆలోచనాశక్తి పెరుగుతుంది. విద్యార్థులు సమగ్ర విజ్ఞానాన్ని సముపార్జించ గలుగుతారని పేర్కొన్నారు రాష్ట్ర ఎ.పి.టి. అండ్ సి.ఎ. ప్రధాన కార్యదర్శి **శ్రీ కొమరగిరి కృష్ణమోహనరావు.** ది. 26-4-2000 నెల్లూరులోని **"రావుబహదూర్ రేబాల లక్ష్మీనర్సారెడ్డి పురమందిరం"** లో జరిగిన బహుమతి ప్రదాన మహోత్సవ సభకు శ్రీ కొమరగిరి అధ్యక్షత వహించారు. **నెల్లూరు శాసన సభ్యులు శ్రీ ఆనం వివేకానందరెడ్డిగారు** ముఖ్యఅతిథిగా పాల్గొనినారు. ఈ టాలెంట్ టెస్ట్‌ను నెల్లూరు జిల్లా ట్యుటోరియల్స్ అండ్ కాన్వెంట్స్ అసోసియేషన్ ఆధ్వర్యమున జిల్లా అసోసియేషన్ అధ్యక్ష, కార్యదర్శులు శ్రీ కె. దశరథ రామయ్య, శ్రీ అన్వర్ భాషాలు, నెల్లూరు డివిజన్ అధ్యక్షులు, కార్యదర్శులు జెడ్. శ్రీనివాసులురెడ్డి, శ్రీ కె. నారాయణ నాయుడులు, కావలి డివిజన్ అధ్యక్ష కార్యదర్శులు శ్రీ పి. పిచ్చిరెడ్డి, కాంతారావులు, గూడూరు డివిజన్ అధ్యక్ష, కార్యదర్శులు షేక్ గౌస్‌భాషా, ఆర్. శ్రీనివాసులు గార్లు నిర్వహించారు.

నెల్లూరులోని ప్రముఖ విద్యాసంస్థలైన రత్నం కోచింగ్ సెంటర్, నారాయణకోచింగ్ సెంటర్ అధినేతలు ఉత్తీర్ణులైన బాలబాలికలకు ఘనమైన ప్రైజులు బహుకరించారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్రేణులలో ఉత్తీర్ణులైన బాలబాలికలకు ఉచితంగా కాలేజీ విద్యను గరపటానికి పై రెండు విద్యా సంస్థలు తమ సంసిద్ధతను వెలిబుచ్చడం విశేషం.

**- భరద్వాజ్**

# శ్రీ మాణిక్యప్రభు

శ్రీ దత్తాత్రేయులవారి అవతార పరంపరలో శ్రీ మాణిక్య ప్రభువు వొకరని భక్తుల విశ్వాసము. వీరు 1817 డిసెంబరు 22న కళ్యాణి (కల్యాన్) నగరంలో బయాదేవి, మనోహరనాయకులకు రెండవ కుమారుడుగా జన్మించారు. వీరి అన్నగారు దాదామహరాజ్ (అసలు పేరు హనుమంతుడు) సాక్షాత్తు ఆంజనేయులవారి అవతారమని ప్రతీతి. తమ్ముడు నృసింహుడు (నృసింహతాత్యా)

ప్రభువువారు ఏబడిలోనూ చేరలేదు, ఎవరి వద్దా చదువుకొనలేదు, ఆయనకు సహజసిద్ధంగా పాండిత్యం అబ్బింది. చిన్నతనం నుండీ ఆయన ఎక్కువ కాలాన్ని కొండగుహలలోనూ, అడవులలోనూ ఏకాంతంగా గడుపుతూ వచ్చారు. సృష్టిలోగల అన్ని పదార్థాల నుండి తాను జ్ఞాన సంపాదన చేశానని ప్రభువు చెబుతుండేవారు. బాల్యం నుండే ఆయన అనేక మహిమలను ప్రదర్శిస్తూ వచ్చారు. తన బాల్యమిత్రుడు గోవిందుడు చనిపోగా, 'గోవిందా' అని పిలువగా, అతడు లేచిరావడం ప్రభువు ప్రదర్శించిన అద్భుతాలలో ఒకటి, అయితే ఈయన విచిత్రరీతులను అర్థం చేసికొనలేని జనం ఈయనను 'వేడాభావు' (వెర్రిసోదరుడు) అని పిలుస్తుండేవారు. వేడాభావు నోట ఏమివచ్చినా అది జరుగుతుందని జనం నమ్మేవాళ్లు.

అప్పారావు అనే సైనికాధికారికి సంతానం లేదు. ఆయన భార్య భీమాబాయి కళ్యాన్ నగరంలోని వేడాభావు గురించి విన్నది. ఆయన అనుగ్రహం కలిగితే తనకు సంతాన భాగ్యం లభించగలదని ఆమె నమ్మి హైదరాబాదు నుండి కళ్యాణ్‌కు పల్లకీలో బయలుదేరింది. కళ్యాణ్‌పూరి ముందు కొంతమంది పిల్లలు ఒక కుర్రవాడిని కొడుతుండటం ఆమె చూసింది. కారణం ఏమిటని అడిగితే ఆ పిల్లవాడు 'నేను వీళ్లకు ఎనిమిది గవ్వలు బాకీ పడ్డాను, నీవు వీళ్లకు ఎనిమిది గవ్వలిస్తే నన్ను కొట్టరు" అన్నాడు. ఆమె వద్ద రూపాయలున్నాయిగాని గవ్వలు లేవు 'ఎనిమిది రూపాయిలిస్తా, వూరుకోండి!' అన్నదామె. 'ఊహు! నేను బాకీ పడింది గవ్వలే, రూపాయలు మాకక్కరలేదు,' అన్నాడా అబ్బాయి. నిజానికి ఒక్కరూపాయికే ఎన్నో గవ్వలొస్తాయి ఆ రోజుల్లో. ఇంతలో భీమాబాయి దృష్టి పల్లకీ బోయీలలో ఒకడు బొడ్లో దోపుకున్న చిన్న సంచీ పైపడింది. దానికి ఎనిమిది గవ్వలు కుట్టివున్నాయి. ఆమె ఆ గవ్వలను తీసికొని ఆ కుర్రాడికి ఇచ్చి, విడుదల చేయించింది. అప్పుడా కుర్రవాడు 'నాకు నీవు ఎనిమిది గవ్వలిచ్చావు. నీకు ఎనిమిదిమంది పిల్లలు కలుగుతారని చెప్పాడు. అతడే తాను వెదుకుతూ వచ్చిన 'వేడాభావు' అని ఆమెకు తెలియదు. తీరా ఆమె ప్రభువు ఇంటికి వెళ్లేసరికి, కుర్రవాడు ఇంటికి రాలేదని తెలిసింది. ప్రభువు దర్శనం కానిదే భోజనం చేయనని ఆమె ఉపవాసం ఉంది. మూడో

**భండారు పర్వతాలరావు**

రోజు ప్రభువు ఇంటికి వచ్చాడు. భీమాబాయిని చూసి 'నీకిదివరకే ఎనిమిదిమంది పిల్లల నిచ్చాను గదా! ఇంకా దేనికోసం ఇక్కడ కాచుక్కూచున్నావు?' అనడిగాడు. అప్పుడుగాని భీమాబాయికి తాను గవ్వలిచ్చి విడిపించింది ప్రభువునే అని తెలియరాలేదు! ప్రభువుకు చిన్నతనంలోనే తండ్రి గతించటంవలన మేనమామ వాళ్ల కుటుంబ వ్యవహారాలను చూస్తుండేవాడు, ఆయన ప్రభువుకు ఒక ఉద్యోగం వేయించాడు. అందులో వసూలు చేసిన పన్నులను ప్రభువు బీదవారికి దానం చేశాడు. దాంతో సర్కారువారాయనను డిస్మిస్ చేశారు. మేనమామ కోప్పడి 'సోమరిగా వుండటం కుదరదు నీ కుటుంబపోషణ నీవే చేసుకో. ఈ రోజు నుండి నీకు నేను భోజనం పెట్టను' అని మందలించాడు. దాంతో ప్రభువు తాను ధరించిన లంగోటీ తీసివేసి ఇంటినుండి బయటకువెళ్లాడు. ఇంక అంతే! ప్రభువుకు సంసారబంధం అలా వదిలిపోయింది. ఆ తరువాత ప్రభువనేక క్షేత్రాల దర్శనం చేశాడు. అమృతకుండం వద్ద ఆరు మాసాలున్నారు. తరువాత కళ్యాణి గ్రామవాసుల కోరికపై కళ్యాణికి వచ్చి తమ్ముని

పెళ్లి జరిపించాడు. ఆ పెళ్లికి కావలసిన సంబారాలన్నీ ఎవరెవరో ఎక్కడెక్కడనుండో తెచ్చియిచ్చి వెళ్లడం ఒక అద్భుతం. అంతే పెళ్లివారేవంటకం అడిగితే అది వస్తుండేది.

ప్రభువు ఎప్పుడూ సంచారం చేసేవారు, ఎక్కడికి వెళితే అక్కడ అద్భుతాలు చేసేవారు. పర్లీ వైద్యనాథ్, తుల్జాపూర్ (భవానీ ఆలయం), పండరిపురం (విఠల్ ఆలయం), గిరినాథ్ (దత్తక్షేత్రం) కాశీ, ప్రయాగ, గయ, హరిద్వార్, గంగోత్రి, కేదార్, బదరీ, పూరీ (జగన్నాథాలయం), తిరుపతి, గాణగాపురం, కొల్హాపురం (మహలక్ష్మి ఆలయం), నరసింహవాడి (దత్తక్షేత్రం), కేతకీ సంగమంలను దర్శించారు. కేతకీ సంగమం వద్ద ఒక రావిచెట్టు క్రింద భూమిలో కప్పబడివున్న శివలింగాన్ని ప్రభువు కనుగొని బయటకు తీయించారు. మొగలిపువ్వులు తెప్పించి పూజించారు. మొగలిపూలతో శివలింగాన్ని పూజించటం ఎక్కడావుండదుగాని కేతకీ సంగమం ఒక్కచోటనే కనిపిస్తుంది. ప్రభువు బీదర్ వెళ్లి, ఝరనీ నృసింహుని గుహలోపలకు పోయి నరసింహస్వామిని అర్చించారు. బీదర్‌లో కొందరు ముస్లింలు స్వామిని పిలిచి, మాంసాహారాన్ని వడ్డించారు, కాని పళ్లెములపై కప్పిన గుడ్డను తొలగించగానే, ఖర్జూరపు పండ్లు, మిఠాయి కన్పించాయి. దాంతో వారు తమ తప్పు మన్నించమని కోరి ప్రభువుకు శిష్యులయ్యారు. మాణిక్యనగర్‌లో తమ ముస్లిం భక్తుల కోసం ప్రభువు విడిగా ఒక మసీదును నిర్మించారు. ముస్లింల కోరికపై బీదర్‌లో ముస్లింలు ఎక్కువగావున్న ప్రాంతంలో గద్దెను స్థాపించారు.

ప్రభువు ఇలా వివిధ స్థలాలు పర్యటిస్తూ మణిచూల పర్వతంపై ఆగారు, ప్రభువు అక్కడ ఒక దత్తాత్రేయుల గద్దెను స్థాపించారు. తన నివాసాన్ని ఏర్పరచుకున్నారు. అదే క్రమంగా మాణిక్యనగర్‌గా అభివృద్ధి చెందింది. ఇక్కడ మాణిక్యప్రభువు దర్బారు తీర్చేవారు. తనను దర్శించ వచ్చిన వారికి భోజనం పెట్టేవారు. ఆయన నెలకొల్పిన బండారు ఖానా (వంటశాల)లో కాశీ అన్నపూర్ణ విగ్రహం వుంది. ప్రభువు మహిమవలన ఇక్కడ లక్షలాదిమంది భోజనం చేస్తూ వచ్చారు. ఇప్పటికీ అక్కడ అలాగే అన్నదానం సాగుతోంది. శ్రీప్రభువులవారు 1865 సం॥లో మార్గశిర శుద్ధ ఏకాదశినాడు తాము సమాధి చెందగలమని ముందుగా శిష్యులకు చెప్పి, రహస్యంగా అదే రోజు జీవసమాధి చెందారు. మాణిక్య ప్రభువు బోధించినవానిని సకలమత సాంప్రదాయమని అంటారు. అన్ని మతములు భగవంతుని దర్శించే మార్గాలను చూపేవే, అందరికీ దివ్య చైతన్య దేవత ఒక్కతే, ఆమె అనేక పేర్లతో, అనేక రూపాలతో ఎవరెలా అర్చిస్తే అలా అనుగ్రహిస్తుంటుంది. ఈ చైతన్యం ఆధ్యాత్మికం, ఆదిదైవికం అని రెండురకాలు. ఆధ్యాత్మికోపాసన జ్ఞాన మార్తాండమనే గ్రంధాన్ని అనుసరించివుంటుంది. ఆధిదైవిక ఉపాసన మధుమతీ సమేత దత్తాత్రేయపరంగా జరుగుతుంది.

మాణిక్యనగర్ హైదరాబాదుకు సుమారు 160 కి.మీ. దూరంలో జహీరాబాదు దాటిన తరువాత హుమ్నాబాదు దగ్గరలో వుంది. బస్ సౌకర్యం కలదు. మాణిక్య ప్రభువు సంస్థాన్ వారు భక్తులకు వసతి సౌకర్యాలేర్పరుస్తున్నారు. భక్తులు ఇక్కడ ఆలయంలో మాణిక్య ప్రభువువారి సమాధి భూగర్భంలో మనోహర మాణిక్య ప్రభువు ('మాణిక్య ప్రభువు వారసులు') సమాధి వున్నాయి. మాణిక్య ప్రభువు వారసులను కూడా మాణిక్య ప్రభువు అనే పిలుస్తారు.

ప్రస్తుత పీఠాధిపతి శ్రీ సిద్ధరాజ్ మాణిక్య ప్రభువుల వారు. వీరు పిన్న వయసునుండే అనేక అద్భుతాలు చేశారు. నిరాడంబరులు, 'అంతా శ్రీప్రభువులకృప' అంటారాయన. వీరు విద్యా సంస్థలనెన్నింటినో స్థాపించి విద్యావ్యాప్తికి కృషి చేస్తున్నారు. ☆

సీ॥ "భక్తితో శ్రీవిష్ణు భగవాను దర్శించ
హరిద్వార తిరుమల కరగవలయు
కైలాసనాధుని కనులార చూడగ
కాశి యుజ్జయినుల కాంచవలయు
శ్రద్ధతో శ్రీరామ చంద్రుని వీక్షింప
ముదమున యోధ్యకు పోవవలయు
చెలిమితో విలసిల్లు శ్రీ కృష్ణుజూడంగ
ద్వారక మధురకు తరలవలయు
ఇన్ని వేల్పుల శ్రద్ధ దర్శించగోరి
పుడమి నాలుగు దిక్కుల వెడలనేల?
పుట్టపర్తిని వెలసిన ముక్తిదాత
సత్యసాయిని దర్శించ చాలుమనకు"

- శంభర వెంకట రామజోగారావు, అహ్మదాబాద్




ఎన్ని హంగులతో, సౌందర్య ప్రభలతో - భువికి దిగి వస్తుంది ప్రభాత సుందరి! ఎన్ని మారులు చూచినా, ఆ దృశ్యం - తనివి తీరని ఒక నవోజ్జ్వల అనుభవంగా ప్రతి ఉదయం ఒక ప్రభాతోత్సవం! ఈ సృష్టిలోని సర్వ జీవరాసులపైనా - అపారమైన దయతో సృష్టికర్త ప్రసాదించే కటాక్ష వీక్షణంలా, ప్రతి ప్రభాతం!

నిత్యం మన కనులముందు సాగే చిత్రరచనం సూర్యోదయ అస్తమయాల సుమనోజ్ఞ సృష్టి విన్యాసం! శ్రమ జీవన తత్త్వానికీ సౌందర్యానికీ సంకేతంగా నిలుస్తాయి అటు ప్రొద్దు పొడుపులూ, ఇటుప్రొద్దు విడుపులూ! ఈ జీవన్నాటక రంగస్థలిలో తొలి యవనిక లేచినంతటి సంరంభంతో అటు వేగుచుక్క పొడవడం, ఇటు వెలుగురేక విచ్చుకోవడం!

ఈ సర్వస్వాన్నీ మేల్కొలిపే దృఢ నిశ్చయంతో తమో గర్భాన్ని చీల్చుకు వచ్చే ఆ వెలుగు తునకకు ఎంతటి సంకల్ప బలం ఉండాలి! జడత నుంచి చేతనకు ప్రయాణించే ఆ కాంతి రేఖకు ఇంకెంతటి కృషీవలత్వం ఉండాలి! అందరికన్నా ముందే అందిపోతుంది కాబోలు, తెల్లవారబోతున్న వార్త. పిట్టలన్ని ముందుగానే లేచిపోయి సందడి ప్రారంభిస్తాయి. రాత్రి అంతా రాజ్యం చేసిన నిశ్శబ్దాన్ని చీల్చుకు వచ్చే ఆ తొలి శబ్దోత్పత్తి ఎంత శక్తిమంతం!

కృషినుంచీ ఫలసాయం అందినట్లూ, అజ్ఞానం నుండీ ప్రజ్ఞాబీజం అంకురించినట్లూ అనిపిస్తుంది విశ్వాన్ని మేలుకొలిపే ఆ తొలి జీవనాదం! నవజీవన రాగానికి అది సంకేతం! ఇట్లా ప్రాతఃకాంతీ, శబ్దచైతన్యమూ, ఈ రెండూ వెలిగించగా, రవళించగా, అప్పుడిక జీవచైతన్యమంతా ప్రారంభం కావడమే! ఇన్ని పులకింతలతో, పలకరింపులతో ఈ ప్రకృతి ప్రపంచాన్ని మేలుకొలుపుతుంది! మరి ప్రపంచమే పరమాత్మను నిదుర మేల్కొల్పటం కోసం సుప్రభాతం పలకడం ఒక అద్భుతమైన, దివ్యమైన సన్నివేశం! నిత్యజాగరూకుడైన సర్వాంతర్యామిని మనం నిదుర మేల్కొల్పవలెనా?

**తొలి వెలుగయ్యె విదరో! కౌసలేయా!**
**మెలకువ వచ్చెనె మీకు రామభద్రా!**

అంటూ అవుడెవుడో బాలరాముడిని నిదుర మేల్కొలిపిన విశ్వామిత్ర మహర్షి విశ్వవిభున సుప్రభాతం చెప్పిన తొలి ఋషి!

కౌసల్యాదేవి కడుపుపంటవైన శ్రీరామచంద్రా! తూర్పు దిక్కున సంజకెంజాయ పొడకట్టుతున్నది. దేవ పూజాది దినకృత్యములకు వేళ అవుతున్నది. నిదుర లేవవలెనయ్యా స్వామీ! ఎంతో మృదువుగా పిలుస్తున్నాడు మహర్షి. నిదురిస్తున్న రామచంద్రునికి ముందుగా తల్లిని స్మరణకు తెస్తున్నాడు. తల్లి పిలుపంత మార్దవంగా పలుకరిస్తున్నాడు. కౌసల్యా సుప్రజారామ అనడంలోని వాత్సల్య విశేషమూ ఉత్తిష్ఠ నరశార్దూల అని నిదుర లేపడంలో జగత్కల్యాణ మంతా ప్రభువు కనులు విచ్చితేనే జరుగుతుందనే ప్రపత్తి భావనా ఇంతటి రక్తితో, భక్తితో సాగే ఆ సుప్రభాత స్తవం దినదినమూ ప్రపంచాన్ని జాగృత పరిచే ప్రభాతగీతం! కర్మాచరణకు ప్రోత్సహించే ప్రబోధగీతం!

ప్రభాత వేళ, సృష్టికర్త దివ్య సౌందర్యమయ శక్తి స్వరూప వైభవమంతా కనులముందు సాక్షాత్కరించిన వేళ భక్తితో, వినమ్రతతో, కృతజ్ఞతతో, పరమేశ్వరుని తలచి బహుపరాకు చెప్పడం ఒక విధంగా మనను మనమే జాగృత పరచుకోవడం! ప్రభాత వేళ విశ్రాంతి చాలించి కార్యోన్ముఖులం కావడానికి మనకు మనమే సమాయత్తం కావాలి. +

**- సి. వేదవతి**

## శ్రీ సత్యసాయివాణి

**"దేహములోని సర్వాంగములు అతిసుందరముగా, అతిపుష్టిగా, అతి ఆనందంగా వుండినప్పటికీ, ఆధారమైన 'గుండె' లేకపోయినయెడల అవన్నియూ యెంత నిష్ప్రయోజనమో, మీకు భౌతికముగా, రాజకీయముగా, వ్యాపారికముగా, లౌకికముగా అన్నియునూ పుష్టిగా, తుష్టిగా వుండినప్పటికినీ, భగవత్ చింతనలనెడి గుండె లేని యెడల మీరు నిర్జీవులే!' - బాబా**

# ముసలిగద్ద - పిల్లి

గంగానది గట్టులో ఒక పెద్ద జువ్విమాను వుండింది. దానితొఱ్ఱలో జరద్గవమనే గుడ్డి ముసలి గద్ద నివసిస్తూ వుండింది. ఆ మానుమీద నివసించే పక్షులు తాము తెచ్చుకున్న మేతలో కొంచెం కొంచెం దాని జీవనానికి పంచి యిస్తుండేవి. దాని చేత ఆ గద్ద జీవనం చేస్తూవుండింది.

ఒక దినం దీర్ఘకర్ణం అనే పిల్లి పక్షిపిల్లల్ని తినాలని ఆ మాను వద్దకు చప్పుడు చేయకుండా వచ్చింది. అది రావటం చూసి పక్షిపిల్లలు భయపడి కూయసాగాయి. ఆ సందడి జరద్గవం విని యెవరో పరాయివాళ్ళు వస్తున్నారని యెంచి, "ఎవరక్కడ?" అని హెచ్చరించింది. అప్పుడా పిల్లి గద్దను చూసి, భయపడి, "హా! చస్తిని కదా! చాలా దగ్గఱికి వచ్చేశాను. తిరిగిపోలేను. తప్పించుకొనిపోయేందుకు వేరే మార్గం లేదు. కార్యం మించిపోయింది. ఇప్పుడు వెనుదీయటం మంచిది కాదు. జరిగేది జరగకపోదు. ఱోటిలో తలదూర్చి, రోకటి పోటుకు భయపడితే తప్పుతుందా? ఇప్పుడు మంచితనం చూపి దీనికి నమ్మకం కలిగిస్తాను." అని యోచించి, దానిముందు నిలిచి, "అయ్యా! నమస్కారం" అనింది. అది వినగానే గద్ద, 'ఎవరు నువ్వు'అని అడిగింది. "నేను పిల్లిని నన్ను దీర్ఘకర్ణం అని పిలుస్తారు" అంటూనే గద్ద "ముందు ఇందుండి దూరంగా పో, పోకుంటే నీ ప్రాణాలు నీవిగావు. చూడు నాదెబ్బ" అని అదలించింది. అందుకు మార్జాలం తొణకకుండ ఇలా చెప్పింది. "తొలుత నామాట కొంచెం వినండి. నేను చంపదగ్గవాడినో కాదో విచారించండి. తర్వాత మీకు తోచినట్లు చేయండి. గుణదోషాలు విచారించి వీడు మంచివాడు, వీడు దుర్మార్గుడు అని నిర్ణయించాలి కాని జాతిమాత్రం చేత నిర్ణయం చేయొచ్చునా?" అంటూనే "నువ్వు వచ్చిన పనియేమి?" అని గద్ద అడిగింది.

పిల్లి ఇలా బదులు పల్కింది. "ఇక్కడ గంగలో నిత్యం స్నానం చేస్తూ మాంసాహారం విడిచి, బ్రహ్మచారిగా చాంద్రాయణవ్రతం చేస్తున్నాను. మిమ్మల్ని ధర్మం తెలిసినోళ్ళని, వుత్తములని ఇక్కడి పక్షులు అప్పుడప్పుడు పొగుడుతుంటే విన్నాను. చాలా రోజులనుంచి మీదర్శనం చేసుకోవాలనే కోరిక కలిగింది. అది యిన్నాళ్ళకు ఫలించింది. మీరు విద్దెలోను, వయసులోను పెద్దోళ్ళు, కాబట్టి మీవల్ల ధర్మాలు తెలుసుకోవాలని మనసుకలిగింది. ధర్మం తెలిసిన మీరే ఇల్లుతొక్కుకొని వచ్చినోణ్ణి చంపటానికి యత్నించారు, సంసారి ధర్మమేనా ఇది? విరోధికయినా ఇంటికి వచ్చినోడికి ఆతిథ్యం ఇవ్వాలిగదా! ఒక వేళ భోజనం పెట్టలేకపోతే, మంచిమాటలతోనైనా మర్యాద చేయాలి. ఇంటికి వచ్చిన అతిథి వుసూరుమని పోగూడదు. అది మహాపాపానికి మూలం గదా!"

**యం. మునికృష్ణారెడ్డి**

అనగా విని గద్ద ఇలా అనింది. "పిల్లులకు మాంస మంటే చాలా ఇష్టం. ఇక్కడ నా, పక్షిపిల్లలున్నాయి. అందువల్ల నేనట్లన్నాను." అనగానే పిల్లి రెండు చెవులు మూసుకొని "కృష్ణ, కృష్ణ" అని ఇలా చెప్పింది. "ఎంత పాపం చేసి ఈ పిల్లి జన్మమెత్తానో, అది చాలక, ఈ పాపం గూడ మూటగట్టుకోవాలా? ఎంత మాట వినాల్సివచ్చింది! ధర్మశాస్త్రాలు విని, కోరికలు తెంచుకొని, ఇప్పుడు చాంద్రాయణవ్రతం చేస్తున్నాను. నేనిలాంటి పాపం చేస్తానా? అహింసయే మేలైన ధర్మమని అన్ని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఏ హింసయుచేయక సమస్త ప్రాణులందు కరుణ గలిగి వర్తిస్తే, అట్టివాళ్ళకు మోక్షం సులభంగా లభిస్తుంది. ప్రాణులందు ప్రేమగలవాడే సర్వధర్మాలు చేసినవాడౌతాడు. అది లేనోడు చేసియూ చేయనోడే. చివరకు తాను చేసిన ధర్మమే తనకు తోడైవస్తుంది. కాని తక్కినదేదీ లోకంలోనిది వెంట రావటంలేదు. తెలియకుండా చెడినకాలం పోనీ, తెలిసి ఇంక చెడతానా? అడవిలో వాటంతట మొలిచిన ఏకాయగసురులతోనైన ఆకలి తీర్చుకొని కాలం వెళ్ళదీయొచ్చు. ఈ పాడు పొట్టకోసం ఇంత పాపం చేయటానికి ఎవడు పాలు పంచుతాడు? ఆహా! ఎంత మాటలాడారు?"

అనగా గద్ద విని, "కోపించుకోకు కొత్తగా రాగానే, వచ్చినోళ్ళ స్వభావం ఎట్లా తెలిసొస్తుంది? అప్పుడు తెలవక చెప్పిన మాట తప్పుగా పట్టుకోవద్దు. పోయినమాట పోనియ్యి. నువ్వు ఇష్టం వచ్చినట్లు రావచ్చు. నీకేలాంటి ఆటంకమూ వుండదు." అని సమాధాన పలికింది.

అటుతరువాత ఆ మార్జాలం జరద్గవంతో మిక్కిలి చెలిమి గలిగి ఆ తొఱ్ఱలో వాసం చేస్తూ వుండింది. ఇట్లా కొన్నాళ్ళు గడిచిన తరువాత పిల్లి ప్రతిదినం అర్ధరాత్రప్పుడు సద్దుచేయక చెట్టెక్కి, పక్షిపిల్లల్ని గొంతుకొరికి తెచ్చి తొఱ్ఱలో పెట్టుకొని తినసాగింది. అక్కడి పక్షులు తమ పిల్లలు కనబడకపోయేసరికి, చాల దుఃఖించి అక్కడక్కడ వెదకనారంభించాయి. అది తెలిసి పిల్లి తొఱ్ఱ విడిచి పాఱి పోయింది. ఆ పక్షులు వెదుకుతూ వచ్చి, తొఱ్ఱలో తమ పిల్లలు ఎముకలు చూసి, "ఈ గద్దయే మన పిల్లల్ని భక్షించిందని" నిశ్చయించాయి. వెంటనే అవి యీ గద్దను గోళ్ళతో రక్కి, ముక్కులతో పొడిచి చంపేశాయి.

**నీతి :- 1. కొత్తగా వచ్చివోళ్ళను నమ్మగూడదు.**

**2. కులశీలాలు తెలవక ఎవరికిన్ని తావివ్వటం తగదు.**

**రసవద్ఘట్టాలు - 48**

# ❋❋❋❋❋❋❋ వావిలికొలను సుబ్బారావు ❋❋❋❋❋❋❋

వావిలికొలను సుబ్బారావుగారికి 'ఆంధ్రవాల్మీకి' అని బిరుదమిచ్చిన వారు మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు.

వారి శ్రీ కుమారాభ్యుదయము ఆధునిక యుగమున ప్రాచీన ప్రబంధములతో తులదూగదగిన మహాకావ్యము. ఆ కాలమున దానిని మెచ్చుకొనని కవి పండితులు లేరు. దానికి లంకలపల్లె వెంకటసుబ్బయ్య, ఎం.ఏ. సుమనోల్లాసని అను వ్యాఖ్యవ్రాసినారు. వావిలికొలను వారికి ప్రధమమున కీర్తి దెచ్చినదా గ్రంధమే. ఇంకొక విశేషము, వారు పోతన రామభక్తి ప్రపత్తి యందేగాక, పోతన నరస్తుతి విముఖ పరత్వమునందును నట్టివారే. ఆ యుదంతమును తెలిపెదను.

క్రీ.శ. 1921లో ప్రిన్స్ ఆఫ్ వేల్స్ యువరాజు హిందూ దేశమును దర్శింపవచ్చెను. అప్పటికి స్వాతంత్ర్యోద్యమ సమరము ప్రారంభమైనది. వేల్సు యువరాజు మదరాసులో దిగినప్పుడు ఆయనను ఆహ్వానించుచు, ఆంగ్ల ప్రభువులను స్తుతించుచు పద్యములు వ్రాయవలసినదిగా అప్పటి గవర్నరు వావిలికొలను వారికి తాఖీదు పంపినాడు. ఆ నాటికి సుబ్బారావుగారు ఉపకారవేతనము పొందుచున్నారు. ఆయననూ రాజధాని కళాశాల ప్రభుత్వ కళాశాల (ప్రెసిడెన్సి కాలేజి) పండితులు కాబట్టి వారికి పద్యములు వ్రాయమని ఆజ్ఞాపత్రము పంపితిమనియు దానితో వారికి ఒక విలువగల సువర్ణ హస్త కంకణము ఖిల్లతు మొదలగునవి లభింపగలవనియు ప్రభుత్వమువారు తెలిపిరి.

వాసుదాసుగారు ప్రభుత్వమువారి కొలువే 21యేండ్లు చేసినారు. ఉపకారవేతనము పొందుచున్నారు. కాని వారి స్వాతంత్ర్యమెట్టిదో చూడుడు. దానికి జవాబుగా "నేను దైవమగు రాముని హస్తముతో తప్ప నరులైన రాజుల హస్తముతో నేదియు స్వీకరింపను" మీ యిచ్చవచ్చినట్లు చేయగలరు అని వ్రాసినారు. ప్రభుత్వము వారాతర్వాత "త్రిపురాన సూర్యప్రకాశరావు" అనువారిచే పద్యములు వ్రాయించి ఆ బహుమతి నొసగిరి. వారి మందర వ్యాఖ్యానము రామాయణ వ్యాఖ్యానములలో చాల విశిష్టమైనది. అందు నవీన వైజ్ఞానిక సంబంధములైన విషయములతో అద్భుత సమన్వయమున్నది. వారు రామాయణము, ఉత్తరకాండను తెనిగించి వ్యాఖ్యానము కూడా రచించినారు. అంగలకుదురు వాసుదాసు కుటీరము వారు దానిని ప్రకటించినారు.

(కళాప్రపూర్ణ డా॥ నిడదవోలు వెంకటరావు (Retd. Head of the Department of Telugu Madras - University) హైదరాబాదు నుండి 16-12-1975న వ్రాసిన లేఖ నుండి)

**- జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

# విప్లవాత్మకమైన ద్రవకటకాలు

టెలిస్కోప్, మైక్రోస్కోప్ వంటి పదాలు సుపరిచితాలు. టెలిస్కోప్ దూరంగా వుండే వస్తువులను దగ్గరగానూ, ఎక్కువ పరిమాణంలోను చూపుతుంది. చంద్రుని మీది పర్వతాలు, లోహాలు, అంగారకుని ధృవాల చుట్టూవుండే మంచుదిమ్మలూ, బృహస్పతి మీద వుండే ఎర్రని మచ్చ, దాని ఉపగ్రహాలు, శనికి వుండే వలయాలు, గాలక్సీల అందచందాలు ఇవన్నీ స్పష్టంగా చూపుతుంది టెలిస్కోప్. అలాగే మైక్రోస్కోప్ కూడా సూక్ష్మ జీవులవంటి వాటిని కూడా బాగా పెద్దగా చేసి చూపిస్తాయి. వీటన్నిటిలోనూ ప్రధానంగా వుండేది కటకం. దీన్నే ఇంగ్లీషులో లెన్స్ అంటాం. దీనిని ఇంతకాలం గాజుతోనే తయారు చేస్తున్నారు. నిజానికి పారదర్శకంగా వుండే ఏ పదార్థమైనా, అంటే ప్లాస్టిక్ వంటి పదార్థం ఏదైనా కటక నిర్మాణానికి పనికి వస్తుంది. ప్లాస్టిక్స్ రేర్ ఎర్త్ వంటివాటితో చేసే కటకాలు ఇప్పటికే వినియోగంలో ఉన్నాయి. ఇటీవల కొందరు ఫ్రెంచి శాస్త్రవేత్తలు వినూత్నంగా ద్రవకటకాన్ని రూపొందించారు. ఇందులో ఉప్పునీరు, సిలికాన్ ద్రావణాలను ఉపయోగిస్తారు. ఇందులో వున్న విశేషం, సౌలభ్యం ఏమిటంటే ఈ కటకం యొక్క మందాన్ని, లేదా ఫోకల్ పాయింట్‌నే అవసరానికి తగినట్లుగా మార్చుకోవచ్చు. ముఖ్యంగా ఎండోస్కోప్‌వంటి శరీరం అంతర్భాగాలలో జొప్పించి పరీక్షలు జరపవలసిన వంటి వాటిలో వివిధ మందాలలో వుండే కటకాలను వాడవలసి ఉంటుంది. ఇటువంటి వాటిలో చకచక మందం మార్చుకోగలిగిన కటకం వున్న ఎండోస్కోప్‌ను ఉపయోగించడం ఎంతో అనువుగా వుంటుంది.

బ్రూనోబెర్జ్ అనే ఫ్రెంచ్ శాస్త్రవేత్త అద్భుతమైన పనితీరును ప్రదర్శిస్తున్న ద్రవకటకాన్ని సులువుగా రూపొందించాడు. దీని కోసం ఒక స్థూపాకారపు పాత్రను ఎంచుకున్నాడు. అందులో తక్కువ ఘనపరిమాణాలుగల రెండు విభిన్న లవణ ద్రావణాలను తీసుకున్నాడు. ఇవి రెండూ కలిసిపోకుండా వాటి మధ్య ఒక సిలికాన్ నూనె బిందువుల పొరను ఏర్పరచాడు. ఇందుకుగాను సిలికాన్ నూనె బొట్టును పారదర్శకత వున్న ఒక పాలిమర్‌లో ఉంచడం వల్ల అది రెండు ద్రావణాల మధ్యలో తేలుతూ కనిపిస్తుంది. దానిచుట్టూ ఒక నీటిపొర ఏర్పడి రెండు లవణ ద్రావణాలను వేరు చేస్తుంది. ఈ అమరిక మూలంగా సిలికాన్ బిందువు పైకి ఉబ్బినట్లుగా ఏర్పడుతుంది. ఈ సిలికాన్ బొట్టుకు ఇరువైపులా ఉన్న విభిన్న ఘనపరిమాణాలు గల లవణ ద్రావణాలలోకి విద్యుత్తును ప్రసరింపజేస్తే నూనె బిందువు ఆకారం మారి విభిన్న పరిమాణాలుగల కటకంగా మారుతుంది. బెర్జ్ బృందం రూపొందించిన ఈ ద్రవ కటకం విద్యుత్తును ఎలక్ట్రానిక్ ప్రవాహాల రూపంలో నిలువవుంచే కెపాసిటర్‌లో కూడా పనిచేస్తుంది. మామూలు కెపాసిటర్‌లో ఇన్సులేటర్ ద్వారా రెండు లోహపు ఎలక్ట్రోడ్‌లను వేరు చేస్తారు. అయితే ద్రవకటకాలని వేర్వేరు

**కె.ఆర్.కె. మోహన్**

ఘనపరిమాణంవున్న లవణ ద్రావణాలు ఎలక్ట్రోడ్స్‌గా పనిచేస్తాయి. సిలికాన్ నూనె, పాలిమార్ కలిసి ఇన్సులేటర్‌గా ఉపయోగపడ్తాయి. ఈ విధంగా రూపొందించిన కటకంలోకి విద్యుచ్ఛక్తిని ప్రసరింపజేస్తే లవణద్రావణాలూ, ఇన్సులేటర్‌గా పనిచేసే సిలికాన్ బిందువు విద్యుదావేశాన్ని పొందుతాయి. దానివల్ల ఆ రెండింటి మధ్య స్థిరవిద్యుత్ వికర్షణ బలం ఏర్పడుతుంది. ఫలితంగా ఇన్సులేటర్‌గా పనిచేస్తున్న సిలికాన్ ద్రవం, పైనా, క్రిందావున్న లవణ ద్రావణానికి అంటుకోకుండా ఉంటుంది. అంతేకాక దాని ఉపరితలం ఉబ్బెత్తుగా ఏర్పడుతుంది. వీటిలోకి ప్రసరింపజేసే విద్యుచ్ఛక్తి పరిమాణం మార్పు చేస్తే సిలికాన్ ద్రవం వ్యాపించే తీరులో పరిమణంలో కూడ మార్పు వస్తోంది. దీనివల్ల నాభ్యంతరం (ఫోకల్ పాయింట్) గూడా మార్పు వస్తుంది. ఈ మార్పును అవసరానికి అనుగుణంగా మలచుకోవచ్చు. ద్రవకటకాన్ని సిలికాన్ లవణ ద్రవణాలతోనే కాకుండా ఇతర ద్రవ పదార్థాలతో కూడా చేయవచ్చు. అయితే మధ్యలో పారదర్శకమైన పొరలా ఏర్పడ్డ బిందువును ఇన్సులేటర్‌గా పనిచేసే పదార్థంగా రూపొందించి కండక్టర్‌గా ఇతర ద్రవపదార్థాలను ఉపయోగించవచ్చు. ఈ ద్రవకటకాలు ఆప్టిక్స్ రంగంలో విప్లవాన్ని సృష్టించనున్నాయి. ✪

# తమిళనాట తెలుగు భాషా వ్యాప్తికి కృషిచేసిన "సాధు" పుంగవుడు

తమిళనాడులో అనేక తరాల నుంచి తెలుగు వారు నివసిస్తున్నారు. విజయనగర సామ్రాజ్యకాలంలో తంజావూరు, మధురై ప్రాంతాలు నాయకరాజుల పాలనలో ఉండేవి. ఆ కాలంలో అనేక తెలుగు కుటుంబాలు తమిళనాడుకు ముఖ్యంగా కావేరీ తీర ప్రాంతాలకు తరలి వెళ్లి అక్కడ స్థిరపడ్డాయి. త్యాగరాజు, ముత్తు స్వామి దీక్షితులు మొదలైన ఎందరో వాగ్గేయకారులు తమిళనాడులో స్థిరపడిన తెలుగువారే. పంచతంత్రం, మిత్రలాభం, మిత్రబేధం కథలకు తెలుగులోకి అనువాదించి తెలుగు వారికి బాలవ్యాకరణం అందజేసిన పరవస్తు చిన్నయసూరి మద్రాస్ వారు. నాటికి, నేటికి తెలుగువారి ప్రామాణిక తెలుగు నిఘంటువు శబ్ద రత్నాకరాన్ని రూపొందించిన బహుజనపల్లి సీతారామాచార్యులుగారు తెలుగువారు. ఇలా ఇంకా చాలామందిని పేర్కొనవచ్చు.

ఐతే తమిళనాడులో కొన్ని తరాల క్రితం స్థిరపడ్డ తెలుగువారు తమ ఇళ్లలో తెలుగును మాట్లాడుకుంటూ ఉంటారు. కాని వారికి తెలుగు నేర్చుకునే సదుపాయాలు - పాఠశాలలు వంటివి లేవు. అందువలన అక్కడ లక్షల సంఖ్యలో తెలుగువారు ఉన్నప్పటికీ తెలుగు రాయడం చదవడం తెలిసిన వారి సంఖ్య చాలా తక్కువ.

ఇట్టి తెలుగు వారికి - మాతృభాష నేర్పాలని తెలుగు భాషా సంస్కృతి సాంప్రదాయాల గురించి తెలియజేయడానికి అహోరహం కృషిచేసిన మహనీయుడు సాధు వరదరాజన్ పంతులు.

వరదరాజన్‌పంతులు 1889లో జన్మించారు. ఆయన తండ్రి రామకృష్ణయ్య పంతులు తమిళనాడు ఎట్టియాపు సంస్థానంలో దివాన్‌గా పనిచేస్తూ ఉండేవారు. తమిళనాడులోని ఆనాటి చాలామంది తెలుగువారికి మాదిరిగానే ఆయనకీ మొదట్లో తెలుగు చదవడం రాయడం రాదు. మద్రాస్ విశ్వవిద్యాలయంలో పనిచేస్తూ ఉండగా తెలుగు నేర్చుకోవాలన్న అభిలాష కలిగి వెంటనే దాన్ని కార్యరూపంలో పెట్టారు. అంతేకాదు తెలుగులో కొంత పాండిత్యం కూడా సంపాదించారు. తెలుగులోని శతకాలను బమ్మెర పోతన భాగవత పద్యాలను చదివి వాటి భావాన్ని అర్థం చేసుకోగల స్థితికి వచ్చారు. ఆనాటి తెలుగు ప్రజలను విశేషంగా ప్రభావితం చేస్తున్న ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికలను క్రమం తప్పకుండా చదివి ఉత్తేజితులవుతూ ఉండేవారు.

తను తెలుగు నేర్చుకోవడమే కాక భార్య, కుమారుడు తెలుగు రాయడం, చదవడమూ నేర్చుకుని పండితులయ్యేట్టు చేశారు. అంతటితో తృప్తిపడలేదు. తనలాంటి తెలుగువారు ఎందరో తమిళనాడులో ఉన్నారు. వారు తెలుగు నేర్చుకునేందుకు తన జీవితాన్ని అంకితం చేసి అందుకు ఒక మహోద్యమాన్ని నడిపారు. తమిళనాడులోని తెలుగువారు తెలుగునేర్చుకునే దీర్ఘకాలిక పథకాలతో పాటు తమిళ లిపిలో తెలుగు గ్రంధాలను ప్రచురించి వారికి తెలుగు సాహిత్యం పట్ల అవగాహనను పెంచారు. అంతటితో ఆగక "దక్షిణాంధ్ర పత్రిక" అన్నపేరుతో ఒక త్రైమాసిక పత్రికను 1927లో స్థాపించారు. మొదట్లో ఇది మద్రాస్ నగరం నుంచి వెలువడుతూ ఉండేది. తర్వాత దాన్ని తన స్వస్థలం తిరువన్వేతికి మార్చారు. తమిళనాడులో తెలుగు బాషాభివృద్ధికిగాను తను స్థాపించిన దక్షిణాంధ్ర భాషాభివర్ధని సభ తరుపున దీన్ని ప్రచురించారు.

**కంచి వాసుదేవరావు**

దక్షిణాంధ్ర పత్రికలో తెలుగు, తమిళ, ఆంగ్ల భాషలో వ్యాసాలు ప్రచురించబడేవి. మూడు భాషలలో వ్యాసాలను ప్రచురించడంలో తనకు గల ఉద్దేశ్యాన్ని ప్రథమ సంచికలో యిల్లా వివరిస్తారు. "ఈ పత్రికను మూడు భాషలలో కనబడుట కొందరికి వింతగా కన్పించవచ్చును. దక్షిణము నందు తెలుగు భాషా పరిస్థితులను గమనించిన ప్రస్తుతం బొత్తిగా నీ పత్రికను తెలుగునే ప్రచురించుట అయుక్తంగా తోచెడిది" అని అన్నారు. ఆయన అంచనా ప్రకారం తమిళనాడులో నివసిస్తున్న తెలుగువారి జనాభా 36,00,000. వీరి సమస్యలు తెలుగు పరిజ్ఞానం గురించి

ఆయన ఒక సంపాదకీయం రాశారు. మొదటి సంచికలో శంకరమ్మ గారు అనే విదుషీమణి "అన్నలారా!" అనే ఒక వ్యాసంలో స్త్రీలలో విద్యావ్యాప్తి గురించి ఒక వ్యాసం వ్రాశారు. ఇంకా కొన్ని ప్రభోదాత్మక వ్యాసాలు ఉండేవి.

తమిళనాడులో తెలుగు భాషను రక్షించుకోవలసిన అవసరం గురించి వారు తెలుగును చదవడం వ్రాయడం నేర్వవలసిన అవసరం గురించి వ్యాసాలు వస్తూ ఉండేవి. తెలుగు లిపి తెలియని వారి సౌకర్యార్థం కొన్ని వ్యాసాలు తమిళ లిపిలో ప్రచురించబడుతూ ఉండేవి.

ఈ పత్రిక వెనుక అట్టపైన తమిళాంధ్రులు నేర్చుకోవడానికి తెలుగు అక్షరాలను బాలశిక్ష అనే శీర్షిక క్రింద ప్రచురించేవారు.

అందరికీ అందుబాటులో ఉండే విధంగా ఈ పత్రిక సాలు చందాను కేవలం ఒక రూపాయిగా వరద రాజన్ పంతులుగారు నిర్ణయించారు.

1953లో ఆంధ్రరాష్ట్రం అవతరించే వరకు తెలుగు పత్రికలలో 90 శాతం మద్రాస్ నగరం నుంచే వచ్చేవి. వీటిలో ఏ ఒక్కటి తమిళ ప్రాంతంలో తెలుగు వారి గురించి పట్టించుకున్నట్లు కన్పించదు. ఈ ఘనత సాధు వరద రాజన్ గారికే దక్కింది.

వరదరాజన్ గారి గురించి జర్నలిజం పైనా ఆంధ్ర ప్రదేశ్‌లో సంపాదకులు ఇల్లా రాసారు.

He started a Telugu News Paper Dakshinandhra Patrika and distributed it free to the readers. His mission succeeded and the Telugus in Tamilnadu working with pride to their language and culture. He travelled all over Tamilnadu Sporting "Save Telugu" banner. The grateful Telugus called Varada Rajaan Dakshinandhra Pitamaha and Deshoddaraka"

వరదరాజన్ గారు కృష్ణాపత్రిక ఆంధ్రపత్రికలకు వ్యాసాలు పంపుతూ ఉండేవారు. నేను కృష్ణాపత్రికలో సబ్ ఎడిటర్‌గా పనిచేస్తున్నప్పుడు సంక్రాంతి సందర్భంగా తమిళనాడులో తెలుగువారి సంక్రాంతి సాంప్రదాయం గురించి వారి వ్యాసం ఒక దాన్ని ప్రచురించినట్లు గుర్తు.

గ్రంథసమీక్ష

## శ్రీరామోపాసన

**అపూర్వ ప్రత్యేక సంచిక**

సంపాదకుడు, ప్రకాశకుడు :

***పురాణపండ రాధాకృష్ణమూర్తి***, ఫోన్ 462964.

బహువర్ణముఖ చిత్రం : **అనేక ఏకవర్ణచిత్రాలు**

**ఫుల్‌క్యాలికో బైండ్‌ప్రతి : రూ. 116-00. వి.పి. పద్ధతియే లేదు.**

ప్రతులకు : **భాగవతమందిరం, సూర్యహోటల్ ప్రక్కన, రాజమండ్రి - 4.**

విశ్వవ్యాప్తంగా గల ఆంధ్ర ఆస్తికులైన శ్రీరామ భక్తులకు కల్పవృక్షంలా కామధేనువులా, అమృత భాండంగా సహకరించునట్టి అనేక వ్యాసరత్నాలతో గాధలతో, సుందరకాండ సారాంశంతో, విశేష వ్యాఖ్యానం గల గాయత్రీ రామాయణంతో, నిత్య పారాయణకు కావలసిన అనేక శ్రీరామస్తోత్రరత్నాలతో, ఉభయ సంధ్యలలో గానం చేసుకోవలసిన శ్రీరామ నామాలతో ఈ ప్రత్యేక సంచిక అలరారుతున్నది.

విశేషించి, పరన శ్రవణమాత్రంచే హృదయం ఆర్ద్రమయ్యేలా 'శ్రీరామప్రేమ' రచన కొనసాగింది. ఇందులో శ్రీరామ పూజావిధానంతో అగ్నివేశ మహర్షి ప్రణీతమైన సమయ నిరూపణ రామాయణం, శ్రీరామ సహస్ర నామ స్తోత్రం, నామావళి పొందుపరచబడ్డాయి. ఈ సంచికకు అలంకారంగా దాశరథీ శతకాన్నీ, దివ్యాలంకారంగా శ్రీరామకర్ణామృతాన్నీ సంపాదకులు పొందుపరచారు. ముమ్మారు పఠించి, స్మరించదగిన 'రామాయణము - సదుపదేశాలు' అన్యవ్యాసరత్నం ప్రబోధాత్మకంగా ఉంది. చివర ప్రత్యేకానుబంధంగా గీతాప్రెస్ గోరఖ్‌పూర్ వారి సౌజన్యంతో చిత్రాలలో "ఆధ్యాత్మ రామకథ" అన్న ఏకవర్ణ చిత్రాలు చాల సుందరంగా ఉన్నాయి. ఇట్టి గ్రంధ రత్న ప్రచురణకు ఉదారంగా విరాళాన్ని అందజేసిన అనపర్తి వాస్తవ్యులు శ్రీమతి అండ్ శ్రీచింతా సూర్యనారాయణరెడ్డి దంపతులు సర్వదా ప్రశంసనీయులే. ఋషితుల్యులైన శ్రీరాధాకృష్ణమూర్తి గారి ఋణాన్ని యావదాంధ్రులూ ఈ విషయంలో తీర్చజాలరని చెప్పడానికి ఆనందిస్తున్నాను.

సమీక్షకులు - **తనికెళ్ళభరణి, సినీయాక్టర్ అండ్ డైరక్టర్**

# సప్తమాతృకారాధన

మనదేశములో స్త్రీ శక్తిని ఆరాధించడము ఋగ్వేద కాలమునుంచి ఉంది. అనంతర కాలాల్లో ఆమె రూపము మహిషాసురమర్దినిగా పూజింపబడింది. తరువాత హిందూ మత ప్రధాన శాఖలైన వైష్ణవ, శైవ, శాక్తేయాలననుసరించి మరెన్నో రూపాల్లో ఆమె ఆరాధ్య దైవమయింది. అయితే ఆ రూపాలన్నింటిని ఒక్కచోట చేర్చి ఆరాధించడమనేది "సప్తమాతృకారాధన" తోనే ఆరంభ మయింది. అది పరోక్షంగా శాక్తేయమత విస్తరణకు ఎంతగానో దోహదపడింది.

బ్రహ్మ, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండి, దేవతలను సప్తమాతలంటారు. వీరికి రెండు వైపుల వీరభద్ర వినాయకులుంటారు. కొన్ని సందర్భాలలో నారసింహుని కూడ సప్తమాతలతో కలిపి అష్టమాతలుగా గణించడం జరిగింది.

సోమదేవుని కథా పరిత్సాగతం, భానుని చారుదత్త నాటకము, శూద్రకుని మృచ్ఛకటికం, వరాహమిహురుని బృహత్సంహితలలోయీ మాతల ప్రస్తావన ఉంది. అగ్ని మత్స్యమార్కండేయ బ్రహ్మాండ, వాయు, భాగవతాది పురాణాలలో కూడ సప్తమాతల వర్ణన ఉంది. అంశుమద్భే బాగమము పూర్వకారణాగమము, రూపమండనము, రూపావర్తనము, విశ్వకర్మ వాస్తుశాస్త్రము, కాశ్యప శిల్ప శాస్త్రము, శ్రీతత్వనిధి, శిల్పరత్నాలలో విశేషించి సప్తమాతల ప్రతిమా లక్షణాన్ని గురించి చెప్పబడినది. ఈశాన శివగురు దేవ పద్ధతిలో సప్తమాతల ప్రతిష్ఠ గురించి ఒక ప్రత్యేక అధ్యాయముంది. తాంత్రిక బౌద్ధంతో కూడా సప్తమాతృ కారాధన ఉన్నట్లు ఆధారాలు లభించాయి. అంతేకాక గుప్తకాదంబ, చాళుక్య పల్లవ, చోళుల శాసనాలలో కూడా సప్తమాతల గురించి ప్రస్తావించడం జరిగింది.

సప్తమాతలను ప్రధాన దేవతలుగా కాక పరివార దేవతలుగా శిల్పీకరించవలెనని శిల్ప శాస్త్రాలలో ఉంది. వీరంతా ఒకే ఫలకంపైగాని విడివిడిగా ఒకేచోటగానీ 2 లేక 4 చేతులతోనున్నట్లు ఇప్పటి వరకు లభించిన ఎన్నో శిల్పాలు ధృవీకరించాయి.

1. శిల్పాగమశాస్త్రాలననుసరించి 'బ్రహ్మ' నాలుగు ముఖములను గలిగి చతుర్భుజములతో అభయ వరద శూలము అక్షమాలలను ధరించి కరండ మకుటంతో పద్మాసనంపై ఆసీనులై ఉంటుంది. ఆమె వాహనం హంస, సాధారణముగా సప్తమాతలు ఒక కాలు పీఠముపై మడచుకొని, వేరొక కాలును క్రిందికి జారవిడిచినట్లు మలచబడి ఉంటారు.

2. మహేశ్వరి జటామకుటాన్ని ధరించి చతుర్భుజములతో అభయ వరదములను శూలము అక్షమాలలను ధరించి ఉంటుంది. ఆమె వాహనం వృషభము.

3. కౌమారి చతుర్భుజయై అభయ వరదములను శక్తి కుక్కుటములను ధరించి ఆశీనురాలై ఉంటుంది. వాహనము నెమలి.

**కాళహస్త్రయ్య**

4. వైష్ణవి-కిరీటాన్ని ధరించి నాలుగు చేతులతో శంకుచక్ర అభయ వరదములను పట్టుకొని ఆశీనురాలై ఉంటుంది. వైష్ణవి వాహనం గరుత్మంతుడు.

5. వారాహి కరండ మకుటమును ధరించి చతుర్భుజములలో హలము శక్తి అభయ వరదములను ధరించి ఉంటుంది. వారాహి వాహనము ఏనుగుగా చెప్పబడినను ఒక్కొక్కసారి మహిషం కూడా ఉంటుంది.

6. ఇంద్రాణి కిరీట మకుటములను ధరించి చతుర్భుజములలో వజ్రము శక్తి అభయ వరదములను కలిగి ఉంటుంది. ఇంద్రాణి వాహనము ఏనుగు.

7. చాముండి నాలుగు చేతులు కలిగి ఉండి అందు అభయ వరదం కపాల శూలములను ధరించి ఉంటుంది. కపాల మాలను యజ్ఞోపవీతముగాను, పులి చర్మాన్ని వస్త్రంగాను కలిగి ఉండి ఊర్ధ్వకేశములతో ఉంటుంది. ఆమె వాహనం ప్రేతం.

క్రీ॥శ. 1వ శతాబ్దము నాటి కుంగాణులు మాతృకా శిల్పాలు మధుర మ్యూజియంలో ఉన్నాయి. వాటిలో మాతలు జంతువుల ముఖాలతోను, తొడలపై బిడ్డలను కలిగి వున్నట్లుగాను రెండుచేతులా అభయము కలశాల తోను మలచబడినారు. వారికి ఇరువైపులా ఆయుధ హస్తులైన పురుషులున్నారు. మాతల వాహనాలు మాత్రము లేవు. ●



వేసవి తరగతులు

# ప్రతిమానవుడు త్రిమూర్తి స్వరూపుడే

"చెడ్డ సంకల్పములచేత చెడును వ్యక్తి
సత్య సంకల్పములచేత సజ్జనుండగు
సకల సంకల్ప రహితుడే శాంతి పొందు
సత్యమును తెలుపుమాట ఈ సాయి మాట."

ప్రేమస్వరూపులారా!

అనంతమైన ఈ జగత్తులో అఖిల ప్రాణికోటిలో మానవుడు అగ్రగణ్యుడు. మానవ జీవితం అత్యుత్తమ మైనది. జీవించతగినటువంటిది, విలువైనటువంటిది. ఈ విలువ దేనినుండి ఆవిర్భవించినది? కేవలం ఈ దేహము వలనా? ఈ ఆకారమువలనా? కాదు..కాదు.. మానవ దేహము కేవలం పాంచభౌతికమైనటువంటిది. ఈ దేహమే ఆత్మకు అద్దె కొంపగా ఏర్పడినది.

దీపక్ ఆనంద్ తన ప్రసంగం ఆఖరులో మూడు ప్రశ్నలు వేశాడు. ప్రతి అవతారమునకు తల్లి తండ్రి ఉంటారు. కాని బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు తల్లితండ్రు లెవరు? అని ప్రశ్నించాడు. ఈ సత్యమును ఎవరూ గుర్తించలేదు. ఏ శాస్త్ర ఉపనిషత్తులు దీనిని చెప్పలేదు. ఏ గ్రంథములలో దీనిని గురించి రచించలేదు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు శరీరధారులు కాదు. కేవలం వీరు గుణస్వరూపులు. గుణస్వరూపులై వీరు ప్రతి మానవుని దేహమునందునూ సంచరిస్తున్నారు. గుణప్రవర్తనల చేతనే మానవ దేహములను ఆశ్రయించి, ఈ దేహములయందే సమస్త కర్మలను కూడా సాగిస్తూ వస్తున్నారు. మానవత్వం లో వుండినటువంటి దివ్యత్వాన్ని, మానవుడే గుర్తించుకోలేక పోతున్నాడు. మానవత్వాన్నే గుర్తించుకోలేనటువంటి మానవుడు, దైవత్వాన్ని ఏరీతిగా నిరూపించ గలడు? కనుక గుణస్వరూపులే బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే సత్యాన్ని గుర్తించి వర్తించాలి.

**"ఈశావాశ్య మిదం జగత్"** భగవంతుడు సర్వభూత విధేయుడు. సర్వభూతాంతరాత్మ. అయితే ఈ ఆత్మకు శృతులు నూతన పేర్లను యిచ్చాయి. ప్రతి దేహమునందు ఒక హృదయం ఉన్నది. ఈ హృదయమునే వేదములు 'ఆత్మ' అని పిలిచాయి. ఇట్టి 'ఆత్మ' అనే హృదయము నుండియే ఆవిర్భవించినది మనస్సు. ఈ మనస్సునే విష్ణుస్వరూపుడు అన్నారు. **'విశ్వం విష్ణుమయం జగత్'** మనసు కూడనూ అట్టిదే. **'మనోమూలమిదం జగత్'** అసలు ఈ మనస్సు ఎక్కడ నుంచి ఆవిర్భవించింది? ఆత్మ నుండియే ఆవిర్భవించినది. ఆత్మకే 'ఈశ్వరా' అనిపేరు. అట్టి ఈశ్వరత్వం ప్రతి వ్యక్తియందునూ ఉంటున్నది. **'ఈశ్వరస్సర్వభూతానాం'** సర్వభూతములయందూ

## భగవాన్ సాయి దివ్య ప్రకటన

వుండినటువంటిది ఈశ్వరత్వమే. ఈ ఈశ్వరతత్త్వమనే టటువంటి హృదయము నుండియే ఆవిర్భవించినది 'మనస్సు' (Mind) అనే విష్ణువు. విష్ణువు యొక్క నాభినుండి (కమలమునుండి) ఆవిర్భవించినటువంటివాడే 'బ్రహ్మ'. ఈ బ్రహ్మయే వాక్ స్వరూపుడు. కనుకనే ఇతనిని ఈ విధంగా వర్ణిస్తూ వచ్చారు.

'శబ్దబ్రహ్మమయీ, చరాచరమయీ, జ్యోతిర్మయీ, వాఙ్మయీ,
నిత్యానందమయీ, పరాత్పరమయీ, మాయామయీ, శ్రీమయీ'

ఇతనే బ్రహ్మస్వరూపుడు. శబ్దబ్రహ్మమయీ- అనగా వాక్ స్వరూపుడే బ్రహ్మ. మనోస్వరూపుడే విష్ణువు. ఆత్మ స్వరూపుడే శివుడు. ఆత్మ, మనస్సు, వాక్కు - **ఈ మూడింటి యొక్క అవినాభావ సంబంధమే దివ్యత్వమైనటు వంటి ఆత్మతత్త్వము. ఈ మూడూ కూడనూ అవినాభావ సంబంధము, అన్యోన్యాశ్రయము.** కాబట్టి గుణస్వరూపులై ప్రతిమానవుని యందునూ బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తమ జీవితాలను గడుపుతూ వస్తున్నారు.

మానవ ఆకారములే వారి ఆకారములు, వారికి ప్రత్యేకమైన ఆకారములు లేవు. ఆత్మకు ఎట్టి ఆకారము? అదియే చైతన్య స్వరూపము. కనుక అట్టి చైతన్య

స్వరూపుడైన ఈశ్వరత్వానికి ఏరూపమూ లేదు. ఈ చైతన్య స్వరూపానికే 'ఈశ్వరత్వము' అని పేరు పెట్టారు. ఈ కాన్షస్‌నెస్ నుంచి కాన్షెస్ వచ్చి హృదయములో చేరింది. అదియే మైండ్. ఆ మైండు నుంచి 'కాన్షెస్' అనేటటువంటి వాక్ స్వరూపుడై పోయినాడు. అనేక పర్యాయాలు చెప్పాను.

The one you think you are
**(నీవనుకుంటున్న నీవు)**
The one others think you are
**(ఇతరులు భావించే నీవు)**
The one you really you are
**(నిజంగా నీవైన నీవు)**

ఈ మూడింటి యొక్క ఆకారములే బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపులు. కనుక బ్రహ్మ వాక్ స్వరూపుడు. విష్ణువు మనో స్వరూపుడు. విష్ణువుకు వున్న సర్వవ్యాపకత్వం మనస్సుకు కూడా ఉంటున్నది. విష్ణువు అనగా సర్వ వ్యాపకత్వంతో కూడినటువంటివాడు. మనసు కూడా అంతే. **'మనోమూల మిదం జగత్'**. ఏ క్షణమందైనా, ఏ ప్రదేశము నందైనా, ఏకాలమునందైనా, ఏ దేశమునందైనా సంచరిస్తుంటుంది మనసు. దేశకాల పరిస్థితుల ప్రభావము లకు ఏమాత్రం యీ మూడునూ లొంగునవి కావు. కనుకనే బ్రహ్మ అనగా వాక్ స్వరూపమైనటువంటివాడు. ఇతని ఆకారమునకు గాని, పేరుకు గాని ఒక పరిమితము అనేది లేదు. విష్ణువు అనగా విశ్వమంతా వ్యాపించినటు వంటివాడు. కనుక ఇతనికి ఒక ఆకారము లేదు. ఇక వాక్కు. ఇదే శబ్దబ్రహ్మమయి. దీనికి కూడనూ ఒక పరిమితము లేదు. కనుక బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనగా పరిమిత రహితమైనటువంటి సర్వాంతర్యామి స్వరూపులు. ఈ సర్వవ్యాపకమైనటువంటి బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపులు అణుమాత్రమైన దేహమునందు ఆవిర్భవించారు. **'అణోరణీయాం మహతో మహీయాం'** మహత్తరమైనటువంటి ఈ శక్తులు అణుశక్తియగు ఈ దేహమునందు లీనమై ఉన్నవి. కాని అణువైనటువంటి ఈ దివ్యశక్తులు బ్రహ్మాండమంతా వ్యాపించి కూడా ఉంటున్నాయి. కనుక బ్రహ్మాండమును మీరు ఎవ్వరూ చూడలేరు. చూచుటకు వీలుకాదు. కనుకనే మన స్వాధీనము నందుండిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మనం అర్థం చేసుకుంటే, విశ్వాన్ని గుర్తించినవారవుతారు. మన హృదయమే ఈశ్వరుడు. కాబట్టి హృదయాన్ని ఈశ్వరత్వంగా గుర్తించినటువంటివారు ఎట్టి దుర్గుణము లకు గాని, దురాలోచనలకుగాని, దుర్బుద్ధులకుగాని లోను కారు. అయితే అట్టి ఈశ్వరత్వాన్ని ఎంత దుర్వినియోగం చేస్తున్నారు మానవులు. హృదయమనేది వుండి కూడనూ, హృదయ రహితులైన మూర్ఖులుగా ప్రవర్తిస్తున్నారు. కనుక హృదయమే బ్రహ్మ అనుకునేటటువంటివారు బ్రహ్మ భావముతోనే జీవించాలి. ఎట్టి సంకల్పములు లేనటువంటి వాడు బ్రహ్మ. కేవలం వాక్ స్వరూపాన్ని ధరించినటువంటి వాడు బ్రహ్మ. ఆ వాక్కులు కూడా చరాచరంతో కూడినటు వంటి వాక్కులు. మాయామయంతో చేరినటువంటి వాక్కు. శ్రీమయంతో చేరినటువంటి వాక్కు. ఇలాంటి వాక్కులు బ్రహ్మ స్వరూపకంగా మనం భావించినప్పుడు మన వాక్కులు ఎంతటి మృదుమధురంగా ఉంటాయి?

*ప్రేమస్వరూపులారా!*

బ్రహ్మ ఏ విధంగా మధురవాక్కులు అభివృద్ధి పరచుకుంటూ, జగత్తునంతా పరిపాలన గావిస్తున్నారో, మనం కూడా మౌనం వహించి ఆ శబ్దప్రవాహమును

ప్రసరింపజేయాలి. మృదు మధురమైన వాక్కులు రావాలి. ఇవియే బ్రహ్మ వాక్కు. బ్రహ్మ మన హృదయములో వుండినందులకు, ఇటువంటి ఫలితమును బహిర్గతం చేయాలి.

ఇంక విష్ణువు, ఈ విష్ణువు మనో స్వరూపాన్ని ధరించి ఉన్నాడు. కాబట్టి ఈ మనస్సు ఎంతో పవిత్రంగా ఉంచుకోవాలి. మనస్సు చాలా ఉపయోగకరమైనది. మనస్సు మృదుమధురంగా ఉండాలి. విష్ణువు నిరంతరం చిరునవ్వులు నవ్వుతూ పరమశాంతంగా ఉంటాడు. కనుక మన మనస్సు కూడా మృదుమధురంగా వుండి, పరమ శాంతంతో చిరునవ్వులు త్రొక్కాలి. ఒక పర్యాయం విష్ణువును సందర్శించాలని, నలుగురు మహర్షులు ప్రయాణమై వెళ్ళారు. వారే సనకస్సనందనాదులు. వీరందరూ చిన్న పిల్లల రూపంలో వెళ్ళారు. అనగా ఆదశలో వారిలో ఎట్టి గుణములూ లేవు. ఎట్టి మానాభిమానములూ లేవు. పవిత్రమైనటువంటి మనస్సందేశం కోసం వెళ్ళారు. **మంచి మనస్సు కలవాడే మహావిష్ణువు. మంచి మనస్సు కలవాడే మానవుడు.** అట్టి మంచి మనస్సు మహావిష్ణువుకు వుండటం చేతనే చిరునవ్వులు చిందిస్తూ వున్నాడు. అక్కడ కూడా ఇద్దరు ద్వారపాలకులున్నారు. భగవంతుని సందర్శించడానికి వెళ్ళేటప్పుడు, మీరు ఈ విధంగా వెళ్ళ కూడదని వారితో వాదనలు ప్రారంభించారు ఆ ద్వార పాలకులు. భగవంతుడు నిర్మలుడు, నిశ్చలుడు, నిస్వార్థ పరుడు, గుణరహితుడు-అలాంటి వానిని దర్శించడానికి, మేము కూడా గుణరహితంగా వెళ్ళుతున్నామన్నారు ఈ నలుగురు. ఆ విధంగా, అనేకరకములుగా ద్వారపాలకు లతో వాదోపవాదములు జరిగాయి. కాని ద్వారపాలకులకు కోపం వచ్చి "మీరు రాక్షసులై జన్మింతురు గాక!" అని శపించారు. కాని ఈ నలుగురు ఏ మాత్రం భయపడక, పట్టుదలతో లోపలికి వెళ్ళి విష్ణువును సందర్శించారు ఆయన మంచి మనస్సును స్వాధీనపరచుకున్నారు. అప్పుడు విష్ణువును 'ఓమనసా!' అని సంబోధించారు. "మాకు మీ మృదుమధురమైనటువంటి దర్శనమే కావాలి. అన్యకోరికలు మాయందు లేవు. మీ దర్శనమే మా ఆనందం. అన్యభీష్టములు మాయందులేవు. మీతో సంభాషణే మా శ్వాస. కాబట్టి మీ దర్శనస్పర్శన సంభాషణలు మాకు కావాలి" అన్నారు. ఆ చంటిబిడ్డలుగా వున్న మహర్షులను అనుగ్రహించి, ద్వారపాలకులైన జయ విజయులను పిలిచి, "మీరు ఈ విధంగా శపించుట న్యాయం కాదు. కనుకనే వారు కూడా మిమ్ములను శపించారు. మీరుకూడా రాక్షసులై జన్మించాలి. అయితే వీరి ప్రార్ధనల చేత, నా అనుగ్రహంచేత, వీరు త్వరలో నా సన్నిధికి చేరుకోగలుగుతారు. ఋషుల శాపాన్ని ఏమాత్రం మార్చుటకు వీలుకాదు. ఋషులు 'మానససంచారులు' అన్నాడు శ్రీమహావిష్ణువు. అప్పుడు మేము రాక్షసులుగా పుడితే మీకు దూరమైపోతాము గదా! అన్నారు ఆ ద్వార పాలకులు. అప్పుడు చెప్పాడు విష్ణువు. "ఆ ఋషులు యిచ్చిన శాపం ప్రకారం తొమ్మిది సంవత్సరాల పాటు (తొమ్మిది జన్మలు) మీరు రాక్షసులుగా జీవించాలి. ఒక వేళ నాకు దూరమై మీరు పరితపిస్తుంటే, నన్ను దూషించి మీరు మూడు జన్మల లోపలే నన్ను వచ్చి చేరవచ్చును. నిరంతరం నన్ను స్మరించటం చేత తొమ్మిది జన్మలు, నన్ను దూషించటం చేత మూడు జన్మలు రాక్షసులుగా ఉండవచ్చును" అన్నాడు విష్ణువు. "మాకు ఈ దూషణ భూషణలతో ఏ మాత్రం సంబంధంలేదు. మాకు మీ సన్నిధి

## సన్నుతి

రాయిని నేను, నన్ను ఒకరత్నముగా నొనరించినట్టి ఆ
త్మీయత నీది తండ్రి! భవదీయ పదార్చనమేను జీవిత
ధ్యేయముగా చరింతు, భవదీయ పదమ్ములవ్రాసి పాడుదున్
ఓయఖిలాండనాథుడ! మహోన్నతమూర్తి! జగత్పతీ! ప్రభూ!

గొంగళిపుర్వు నేను, నను క్రొత్తగ చిల్కగ మార్చినట్టి శ్రీ
రంగపతీ! చిరంబుగ తలంతును నీ శుభనామమెప్పు సా
ష్టాంగ నమస్కృతుల్ సలిపెదన్ బ్రతుకంత, త్వదీయ సేవలో
నంగనెదన్ ప్రశాంతి, కరుణామయ! వందనమయ్య! శ్రీపతీ!

వెదురును నేను, నన్ను ఒక వేణువుగా పలికించినట్టి శ్రీ
హృదయము నీది తండ్రి! పలికింపుము నీయమృతంపు మోవిపై
పదములువేలు, తీయనగు పాటయి ఈ జగమంత నిండెదన్
ముదముగ శ్రీపతీ! అమృతమూర్తి! జగత్పతి! వేంకటేశ్వరా!

**- తిరునగరి, ఆలేరు**

ప్రదానం. కనుక మిమ్ములను దూషించి అయినాసరే మూడు జన్మలలోనే మీ సన్నిధి చేరుకుంటాం తరిస్తాం" అన్నారు ఆ ద్వార పాలకులైన జయ విజయులు. "సర్వదా సర్వకాలేషు సర్వత్రాహరి దూషణం" ఈ విధంగా దూషించి.. దూషించి.. ఋషులు యిచ్చిన శాపాన్ని కరిగింపజేసుకొని విష్ణు సన్నిధికి చేరుకున్నారు ఆ ద్వార పాలకులు.

అసలు ఈ దూషణ, భూషణ, తిరస్కారములలో వున్న మార్పులేమిటి? ఏమీ మార్పులేదు. కృష్ణుని కూడా అనేక విధముల దూషిస్తుంటారు.



## పురుష సూక్తము 12

**యత్పురుషం వ్యదధుః**
**కతిధా వ్యకల్పయన్ ।**
**ముఖం కిమస్య కౌబాహూ**
**కావూరు పాదా వుచ్యేతే ॥**

**అర్థం :**

| | |
|---|---|
| **యత్** | : ఎప్పుడైతే |
| **పురుషమ్** | : పురుషుని నిర్మాణం |
| **వ్యదధు :** | : ఏర్పాటు చేయబడిందో |
| **కతిధావ్యకల్పయన్** | : ఎన్నివిధాల విశేష కల్పనలు చేశారో చూదు అవుదు ఈ ప్రశ్నలు ఉద్భవించాయి |
| **అస్య** | : ఆ పురుషునికి |
| **ముఖంకిమ్** | : ముఖమేది? |
| **బాబహూకౌ** | : బహువులేవి? |
| **ఊరూకౌ** | : ఉరువులేవి? |
| **పాదౌకౌ** | : పాదాలు ఏవి? అని |
| **ఉచ్యతే** | : చెప్పబడినాయి? |

**వ్యాఖ్య :**

**ఆయజ్ఞోద్భవ పురుషునికి ముఖం చేతులు తొడలు కాళ్ళు ఏవి! ఎలా నిర్ణయించారు? అనే ప్రశ్నలు వచ్చాయి.**

"చిత్తచోరా యశోదాకే బాల్"
నవనీత చోర గోపాల్..."

కృష్ణుని 'చిత్తచోరుడు' అనటం దూషణ కాదా! అదే మాటలతో చెబితే 'ఏ గజదొంగా!' అంటారు. గజదొంగ! అంటే కృష్ణుని 'గజదొంగ!' అన్నారని కృష్ణుని భక్తులు పోట్లాటకు దిగుతారు. అదే సంగీత సాహిత్యంగా "**చిత్త చోరా యశోదాకే బాల్, నవనీతచోర గోపాల్**" అని పాడితే మీరు కూడా తాళం వేస్తారు. ఆ సంగీత మాధుర్యం లోపల ప్రతి ఒక్కరూ తన్మయులై పోతారు. కనుక ప్రతి మానవుడు ఏదో ఒక రూపంలో భగవంతుని దూషిస్తూనే వుంటాడు. కనుకనే ఈ జయ విజయులు కూడా భగవంతుని నిందించి, మూడు జన్మల లోపలనే వారు శాపవిముక్తులైనారు. ఇది కూడా మనస్సు యొక్క ప్రభావమే. కనుక విష్ణువు అనగా మనోస్వరూపుడే. శంక చక్ర గదాధారి కాదు, ఏదో రవివర్మ ఈ చిత్రమును చిత్రించాడు.

మనోస్వరూపుడే విష్ణువు. అందుకోసమనే నేను అప్పుడప్పుడు చెబుతుంటాను. నేను "డైమండ్‌రింగ్" యిచ్చినప్పుడు డై-మైండ్ అంటుంటాను. అనగా నీకు మనోనాశనమగుగాక! అని అర్థం అనగా ఏవిధంగా? నీకు మానవత్వంలో వుండినటువంటి మనస్సుపోయి, దైవత్వం తో వుండినటువంటి మనస్సు నీకు ప్రాప్తించుగాక! అని అర్థం. కనుక ప్రతి మానవునియందు కూడనూ వుండినటు వంటి మనసే విష్ణుస్వరూపుడు. ప్రతి మానవునియందు ఆవిర్భవించినటువంటి పలుకే బ్రహ్మ స్వరూపము. కనుక మన మాటలను దుర్వినియోగం చేయకూడదు. అందు వలనే ప్రాచీన ఋషులు 'మౌనం' వహిస్తూ వచ్చారు. అధిక మాటలు మాట్లాడటం వలన అసత్యపు మాటలు కూడా మాట్లాడవచ్చునేమో! అధిక మాటలు మాట్లాడటం వలన పరులను నొప్పించిన వారమవుతామేమో! అధిక మాటలచేత ఉద్రేకం వచ్చి తప్పుడు మాటలు మాట్లాడుతామేమో! కనుక 'మౌనం' వహించడమే మేలని మౌనవ్రతాన్ని చేబట్టారు ఆనాటి ఋషులు. మౌనమనగా కేవలం మాట్లాడకుండా వుండటమే కాదు. సంకల్ప బంధమే మౌనము. సంకల్పములే లేకుండా ఉండాలి. అది ఆనాటి మహర్షుల భావన. కనుక మనయందున్న భావములు మాటల స్వరూపంలో కొంతవరకూ తగ్గించుకుంటూ రావాలి. కనుకనే Less

luggage more comfort make travel a pleasure అన్నారు. మనం తక్కువ మాట్లాడాలి. ఆ తక్కువ మాటల చేత మనం బ్రహ్మస్వరూపాన్ని అనుభవించినవార మవుతాం. బ్రహ్మ అనగా వాక్కే. విష్ణువు అనగా మనస్సే. ఈశ్వరుడు అనగా హృదయమే. మనకు హృదయం ఉన్నది, మనసూ ఉన్నది, వాక్కూ ఉన్నది. కనుక నీవే బ్రహ్మవిష్ణు స్వరూపానివి. ప్రతి మానవుడూ 'త్రిమూర్తి స్వరూపుడే'. కనుకనే అతని యందు త్రిగుణములు ఆవిర్భవిస్తున్నాయి.

"త్రిగుణం, త్రిగుణాకారం, త్రినేత్రంచ, త్రియాయుధం, త్రిజన్మపాపసంహారం, ఏకబిల్వం, శివార్పణం' ఈశ్వరునికి 'త్రినేత్రం' కూడా ఉంటున్నది. ప్రతి మానవునికి కూడా 'త్రినేత్రం' ఉంటుంది. నాకు ఉన్నదా? లేదా? అని చూచుకుంటారు. అదికాదు త్రినేత్రము. జరిగినదానిని (Past) నీవు చూడగలవు. జరుగుతూవున్న దానిని (Present) నీవు చూడగలవు. కాని జరుగబోయేదానిని (Future) నీవు చూడలేవు. ఆ జరుగబోయే దానిని (Future) చూచేటటువంటి శక్తియే 'త్రినేత్రం'. నీవు నిజంగా Past, Present లను సరియైన స్థితిలో పెట్టుకుంటే, Future నీ చేతిలోనే ఉంటుంది. కాని ఈనాటి మానవుడు ఎప్పుడు చూచినా గతించిన దానిని నిరంతరం చింతిస్తూంటాడు, భవిష్యత్తును గురించి ఆలోచిస్తుంటాడు. ఈ Past ను, Future చింతించటం చేత Present ను మరచిపోతున్నాడు. కాని Present అనేది Past నుంచి వచ్చినటువంటిదే. ఇప్పుడున్న Present యొక్క ఫలితమే Future కాబట్టి Past, Future రెండూ Present లోనే ఉంటున్నాయి. ఈ సత్యమును గుర్తించటం లేదు. Present ను ఆనందంగా గడిపితే Future బాగుంటుంది. Past అనే వృక్షము నుండి వచ్చిన విత్తనము ఈ Present ఈ Present అనే విత్తనము నుండి ఆరంభమయ్యేటటువంటి వృక్షమే Future కాబట్టి Future అనే Tree, Past అనేటటువంటి Tree, Present అనే విత్తనములో ఉంటున్నది. ఈ విత్తనంలో చిన్న మొక్క మాదిరిగా ఉంటున్నది. ఆ చిన్న మొక్కయే వృక్షముగా మారిపోతున్నది. కనుక Future అంతా Present లోనే ఇమిడి ఉంటున్నది. కనుకనే నీ వాక్కులను పవిత్రమైనవిగా పెట్టుకో. Present లో నీ వాక్కులను సద్వినియోగ పరచుకో. ఈ సద్వినియోగపరచుకొనే నిమిత్తమై మంచి మనసును కలిగివుండు. ఎందుకనగా, ఈ బ్రహ్మ ఎక్కడ నుంచి వచ్చినాడు? వాక్ శబ్ద స్వరూపుడు. ఆ వాక్కు ఎక్కడ నుంచి వచ్చింది? విష్ణువు నుంచే వచ్చింది? విష్ణువు నాభి కమలము నుండే బ్రహ్మ ఆవిర్భవించాడు. కనుక విష్ణువు యొక్క అనుగ్రహం చక్కగా వుండినప్పుడు వాక్కు పరిశుద్ధమవుతుంది.

ప్రేమస్వరూపులారా! ఈశ్వర సంకల్పమునకు ఎన్ని అడ్డంకులు వచ్చినా, అది నెరవేరకుండా పోదు. కనుక హృదయ స్థాయిలో వుండిన తత్త్వము ఎప్పటికీ ఫలిస్తుంది. హృదయము మంచిదైనప్పుడు, పవిత్రమైనప్పుడు ఫలితము కూడా మంచిదే అవుతుంది. కనుక హృదయమును ఎప్పుడూ పవిత్రమైనదిగా పెట్టుకోవాలి. అదియే శివ తత్త్వము. అలాంటి శివమయమైనటువంటి, మంగళకర మైనటువంటి హృదయాన్ని మనం అభివృద్ధి పరచుకోవాలి. హృదయాన్ని పరిశుద్ధం గావించుకోవాలి. చెడ్డభావాలు హృదయంలో ప్రవేశించకుండా చూచుకోవాలి అట్టిదే శివస్వరూపము. ఆ శివస్వరూపము నుండి ఆవిర్భవించి

## సాయిరామా (శత) కోటిప్రణామా

దండ మొక్కటి నీకు ఈశ్వరాంబాసుత
రెండు దండంబులు పుండరీక
మూడు దండంబులు ముల్లోకపూజిత
నాల్గు దండంబులు నళిననేత్ర

అయిదు దండంబులు ఆశ్రిత వత్సలా
పదియు దండంబులు పర్తివాసా
నూరు దండంబులు నీలమేఘశ్యామ
వేయి దండంబులు వేదవేద్య

లక్ష దండంబులు అక్షయవరప్రదాత
కోటి దండంబులు కోమలాంగ
దండ మొనరించు నీకు నే ధన్యచరిత
ఏలుకో రాదె నీదాస, దాసవరుని

ఆదుకో రాదె, అభయ ప్రదుడవగుచు
చేరదీయగరాదె, కరుణతో కల్కిరూప
నిన్ను కోరను ఇంతకు మించియేది
సాయిరామా శతకోటి ప్రణామా

- పి.యస్.వి. సుబ్రహ్మణ్యం, శ్రీకాకుళం

నటువంటిది Mind ఆ Mind ను యిప్పుడు చాలామంది Monkey Mind అంటున్నారు. అది Monkey Mind కాదు Man Kind కాబట్టి అది విష్ణుస్వరూపమే. కనుక మన మనసును పవిత్రమైనటువంటి కరుణతో నింపాలి, ఆనందంతో నింపాలి, ప్రేమతో నింపాలి. ఈ విధంగా చేసినప్పుడే ఈ Mind విష్ణు స్వరూపాన్ని పొందుతుంది.

సత్యవాక్కు బ్రహ్మ స్వరూపము. సత్యముకంటే మించినది మరొకటిలేదు. మనసు విష్ణు స్వరూపము. హృదయమే శివస్వరూపము. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఆకార స్వరూపులుగా కాకుండా, గుణస్వరూపులుగా ఉంటున్నారు. భగవంతుడు అభీష్టాలను నెరవేరుస్తుంటాడు. చెడ్డను సంహరిస్తుంటాడు. భక్తులు చేసే పూజలను పరిగణనలోనికితీసుకొని, భగవంతుడు అనుగ్రహిస్తు ఉంటాడు. ఎలాంటి పరిస్థితులలోనైనాసరే తప్పక రక్షిస్తాడు. ఏమాత్రం సందేహించవద్దు. కనుక ఈ సత్యమును గుర్తించి, హృదయాన్ని పవిత్రమైన మార్గంలో ప్రవేశ పెట్టండి. నా హృదయమే ఈశ్వరుడు, నా మనసే విష్ణువు, నా వాక్కే బ్రహ్మ - ఈ మూడింటిని పూర్తిగా నమ్మి, ఆ మూడింటిని సద్వినియోగపరచుకుంటూ రండి. మీకు సద్గతి తప్పక కలుగుతుంది. అన్నివిధాలా మీరు దైవములోనే లీనమవుతారు.

ప్రేమస్వరూపులారా !

మీరందరూ త్రిమూర్తి స్వరూపులే, త్రిమూర్త్యాత్మక స్వరూపులే, త్రిగుణస్వరూపులే, త్రినేత్రస్వరూపులే. ఈ సత్యాన్ని విస్మరించకండి. కాలము చాలా పవిత్రమైనటువంటిది. ఈ కాలాన్ని పవిత్రంగావించడానికి మంచి మాటలు, మంచి మనసు, మంచి హృదయము కలిగి ఉండండి. ఈ అన్నింటికన్నా ప్రేమను ప్రదానంగా పెట్టుకోండి.

(ది. 16-5-2000న బృందావనం (బెంగుళూరు)లోని రమేష్ హాల్‌లో వేసవి తరగతుల సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్యప్రసంగము నుండి)

---

# శ్రీలలితా సహస్రనామ నవనీతము

**విశ్వవ్యాప్తంగా గల ఆంధ్రాస్తిక సోదర సోదరీమణులూ**

**శ్రీలలితా సహస్రనామ స్తోత్రపారాయణపరాయణులూ అయిన**

## ఉదార హృదయులకు సాదరాహ్వానం

శ్రీ లలితా భక్తులైన ఉదారులారా!

పుంభావసరస్వతులూ, భారతీయ జ్ఞానపీఠ అవార్డ్ కమిటీ డైరెక్టర్ గారూ, శ్రీవిద్యోపాసకులూ అయిన బ్రహ్మశ్రీ ఇలపావులూరి పాండురంగారావుగారి ద్వారా రచించబడి తిరుమల తిరుపతి దేవస్థానాల ద్వారా విడుదలయిన 'నామనవనీత' గ్రంధరత్నాన్ని దేవస్థానం వారి అనుమమతితో మీవంటి దాతలు అందజేసే విరాళాలతో అసంఖ్యాక ప్రతులు ప్రచురించి దాతల ద్వారానే శ్రీలలితా భక్తులకు వితరణ చేయించాలన్న పరమపావన సంకల్పం ఆ మహేశ్వరి అవ్యాజ్య కరుణవల్ల నాలో జాగృతమైనది. ఇందు నిమిత్తం తమ వంశ పరిచయంతో ఫొటోతో వేయి ప్రతుల వితరణ నిమిత్తం రూ. 11,116-00ల వంతున అందజేయగలవారిని సాదరంగా నూరు మందిని ఆహ్వానిస్తున్నాము.

రూ. 11,116-00లు అందజేసి వేయిప్రతులు వితరణ చేసుకోదలచిన ధన్యాత్ములైన శ్రీ లలితాదేవి భక్తులకు ద్రవ్యం అందిన 21 రోజులలోగానే సిద్ధి చేసిన శ్రీ చక్రపూజాయంత్రాన్నీ, ధారణాయంత్రాన్నీ, "నామనవనీతం" యొక్క 1000 ప్రతులనూ అందజేసెదము. ఈ మహావకాశాన్ని సకాలంలో సద్వినియోగం చేసుకోండి. ధర్మతేజంతో విరాజిల్లండి. మీతోబాటు వేయిమంది తరించడానికి మార్గం చూపండి.

వివరాలకు :

**పురాణపండ రాధాకృష్ణమూర్తి,**

**29-6-13డి, రాజమండ్రి - 4. ఫోన్ : 462964**



# ఆ మూర్తికి - అఖండ హారతి



ఆత్మ అన్నది వుంటే పరమాత్మ తప్పక ఉంటాడన్నది సత్యం. ఆ పరమాత్మ యొక్క శక్తిని కళ్ళతో చూస్తూ.... నా మనసుకి నిజమనిపించటంలేదు అంటూంటాం. కనిపించేదాన్ని కాదంటుందీ కనిపించని మనసు. అసలా మనసనేది ఎలావుంటుందో తెలియదు. అసలు వుందో లేదో అంతకన్నా తెలియదు. ఉండదు అనడానికి వీలులేదు. ఎందుకంటే.... మనిషి వుంటే మనసు ఉంటుంది, మనసు వుంటే ఆత్మ ఉంటుంది. ఆత్మ ఉంటే పరమాత్మ ఉంటుంది. నిజానికి మనిషి సామాన్యమైనవాడుగా పుట్టి అంచెలంచెలుగా ఆధ్యాత్మికంగా ఎదుగుతూ పరమాత్మ కావడానికి వీలుంటుందేమోకాని, పరమాత్మ పరమాత్మగానే పుడతాడు. అతని పుట్టుక అద్భుతంగా ఉంటుంది. అతని ప్రవర్తన అతీతంగా ఉంటుంది, అతని కరుణ ఆశ్చర్యంగా ఉంటుంది అదుగో అలాంటి అత్యద్భుతమైన, మానవాతీత మైన, అత్యంతాశ్చర్యకరమైన 'శక్తి' ఒక 'మూర్తి'గా వెలిసింది రాయలసీమ 'పర్తి'లో.

మనసు అందరికీ ఉంటుంది. పులకించే మనసు కొందరికే ఉంటుంది. తనువు అందరికీ ఉంటుంది కాని, తన్మయత్వం చెందే తనువు కొందరికే ఉంటుంది. అందమైన కనుదోయి అందరికీ ఉంటుంది కాని, అందాన్ని, ఆనందాన్ని అనుభవించి పరవశించే విశాలమైన కనుదోయి కొందరికే ఉంటుంది.

మనిషి తన్మయత్వం చెంది, ఆనందంతో పులకరించి, పరవశం చెందే ఆ క్షణం దొరకాలంటే ఆ మూర్తి యొక్క అనుగ్రహ వీక్షణంలోనే లభిస్తుందనేది నిత్యసత్యం, ఆ సత్యం నిజంగా సత్యమే. నిజమైన ఆ సత్యమే భక్తులందరూ బాబాగా ఆరాధిస్తున్న శ్రీశ్రీశ్రీ భగవాన్ సత్యసాయి బాబావారు.

ఆ సాయి మనలో ఒకడుగా ఉద్భవించిన యుగ పురుషుడు. మానవుల అజ్ఞానాంధకారాన్ని అద్భుతంగా తొలగించే అవతారమూర్తి. ఆ అద్భుతం మనకొక లీల. మన ప్రతి లీలా... అతని ఖేల. ఒకే సమయంలో ఎన్నెన్నో ఎదల సొదలను, రొదలను వింటూ... కేవలం చూపుడు వేలి కదలికతో మౌనంగా లేఖలు వ్రాస్తూ ఆ మనసు లన్నింటినీ ఏకకాలంలో సమాధానపరిచే అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుడతడు.

చేతులందరికీ ఉండవచ్చు కాని సేవచేసే చేతులు కొందరికే ఉంటాయి. సేవకే అంకితమై, నేను మీ సేవకుడను మాత్రమే అంటున్న సాయి తన అనంతమైన శక్తులన్నింటినీ మన కొరకే వినియోగిస్తున్నారు. ఆయన భాషణం సుమధుర సంభాషణం. ఆ పలుకు తేనెలొలుకు మధుర చినుకు. ఇలలోనైనా, కలలోనైనా వెలువడిన ఆ అక్షరం జరిగి తీరుతుందన్నది అక్షరసత్యం.

**భారతీకృష్ణ**

సాయితత్వాన్ని తెలిసి ఆరాధించడంవేరు. తెలియని వారి దరికి 'బంగారూ' అంటూ చేరి మీరంతా నా వారే అని అక్కున చేర్చుకుంటున్న చక్కని స్నేహితుడూ ఆయనే. జన్మజన్మల మన బయోడేటాను నిక్షిప్తం చేసుకొని ఆ జన్మాంతర సువాసనలన్నీ రంగరించి మానవత్వానికి మెరుగులుదిద్ది మాధవత్వంగా మలుస్తున్న అద్భుత శిల్పి మానవాకారంలో మన ముందున్న ఈ సాయి మాధవుడే.

ప్రక్కవాడికి ప్రమాదం జరిగితే పరుగున ఆదుకోలేని మనసున్న ఈ సమాజంలో ఎవరండీ... ఇలా నేనున్నాను నీకు అని ఆదుకునే వ్యక్తి, కంటికి కనబడని ఆ దివ్యశక్తి. ఇదే సాయితత్వం. ఎంతటి భయంకరమైన మనస్తత్వం అయినా సాయితత్వం ముందు తలవంచాల్సిందే.

ఆడంబరాలు, ఆభరణాలు ఏమీలేక అతి సామాన్యంగా కనబడే మన సాయి అంతు తెలియని జ్ఞాన అంబోధిలా, భక్తులందరికీ దోసిళ్ళతో జ్ఞానామృతాన్ని పంచిపెడుతున్నారు. భక్తితో కొలిచే ప్రతి వ్యక్తీ 'సాయీ'... అని ఆర్తిగా పిలిచినవెంటనే 'ఓయీ'... అని బదులిస్తూ కనుల ముందు కనిపించే ప్రత్యక్ష భగవానుడు మన సాయి.

సృష్టి స్థితి, లయకారకుడైన ఈ సాయి భగవానుడు సప్తస్వరాల శృతిలయలకు వశుడు. మనసును రంజింపజేసే సాధనం సంగీతం. సర్వాంతర్యామి లీలలు విశ్వమంతా వ్యాప్తి చెందాలంటే రాగమే మార్గము. పాట ఎప్పుడూ ప్రజలకు అతిచేరువగా ఉంటుంది.

మనసుకి 'శాంతి' నందించి పరవశింపజేసే మంచి రాగం, ఆర్తితోకూడిన 'సత్య'మైన భావము, జీవాత్మను పరమాత్మలో లయం చేయగలిగే 'ప్రేమ' అనే లయ పాటకు ముఖ్యం. సత్య, శాంతి, ప్రేమలు మూడూ రాగ భావ తాళములైతే, "నువ్వు ఏ శృతిలో అయినా పాడు, ఏ రాగంలో అయినా గానం చెయ్యి, చక్కని లయను ఆ పాటకు జోడించు కాని భావాన్ని మాత్రం మరువవద్దు. ఇక్కడ భావం అంటే... నీ హృదయంలోని ఆర్తిని అందులో సమ్మేళనం చెయ్యి, అదే నేను కోరుకొనేది, నాకు కావల్సినది, నన్ను నీ దగ్గరకు చేర్చేది. కోవెలలో మ్రోగుతున్న కంచు గంట ఓంకార నాదం జేస్తూ భగవంతుణ్ణి ఎలా మేల్కొల్పుతుందో, భావం నిండిన గానం భవరోగాలను మాయం చేసి భగవానుడిలో లీనమౌతుంది" అంటూ వుంటారు సాయి.

నిజమే... భక్తుడైన ప్రతి వారికీ సంగీతం వస్తుందా? సంగీతం రాలేదని భక్తుని దరికి సాయి రాకుండా వున్నాడా! ఉపనిషత్తులోని సారాంశం గ్రహించటం కొందరికే సాధ్యమేమో కానీ, సాయి మాటలోని ప్రతి అక్షరం సరాసరి హృదయంలో దాచుకోవటం ప్రతి ఒక్కరికీ సాధ్యం. భవరోగాలతోపాటు దేహసంబంధమైన వ్యాధులను కూడా కనురెప్పపాటులో శస్త్రచికిత్స చేసి రూపుమాపగల కరుణామయుడు మన బాబా.

దుర్గుణాలను, దుర్వ్యసనాలను, దుష్టరోగాలను చిటికెలో నయం చెయ్యగలిగే ఈ సాయి డాక్టరా? కాదు. మాటలతో మురిపించే యాక్టరా? కానే కాదు. మరి! ఎవరీ వ్యక్తి? ఏమిటీతని తత్త్వం? ఊహకందని అతీత మైనటువంటి తత్త్వమే సాయి తత్త్వం. ఆ వ్యక్తే, మానవ రూపంలో మన మధ్య తిరుగుతూ, మనలో ఒకడుగా మనతో బాటుగా, మనందరికీ బంగారు బాటగా, మనలకు బాసటగా నిలిచిన 'సత్యం'. ఇదే మన పూర్వ జన్మ సుకృతం.

ప్రేమ! ప్రేమ తప్ప నాకు ఏ పూజలు వద్దు, "నీ ప్రేమను పెంచుకో - నా ప్రేమను పంచుకో! రా!" అంటూ పిలిచే ప్రేమమూర్తి ఆయనే. ఇదే సాయి ప్రేమమూర్తిత్వం. ఇంత చక్కని స్వామికి సమకాలికులుగా జన్మించటం మన అదృష్టం. ఈ స్వామి దయ వలన భక్తి జ్ఞానామృతం లభించటం మరీ భాగ్యం.

ఈ జన్మంతా స్వామి పదసేవలో కర్పూరంలా కరిగిపోవాలనే కోరికతో మనోపుష్పం సమర్పించి హృదయాంజలి చేసి నాలో ఉన్న సాయి పరమాత్మకు, ఆత్మ ఫలాన్ని నివేదన చేసి నా భావార్తిని - అఖండ హారతిగా పట్టి ఈ అక్షర నీరాజనాలిచ్చుకుంటున్నాను. ■

## సుభాషితవాణి

"దైవాదీనం జగత్సర్వం
సత్యాధీనం తు దైవతమ్
సత్యం ఉత్తమాధీనం
ఉత్తమో మమ దేవతా!"

జగ్గత్తు యావత్తూ భగవంతునికి అధీనమై ఉన్నది. అయితే ఆ భగవంతుడు సత్యానికి కట్టుబడి ఉన్నాడు. ఆ సత్యము ఉత్తములలో ఉన్నది. మరి, ఆ ఉత్తములే తనకు దైవసమానులని భగవంతుని వాక్కు.

## విదురనీతి

"ఆరోగ్యమానృణ్య మవిప్రవాసః
సద్భిర్మనుష్యైః సహ సంప్రయోగః
స్వప్రత్యయా వృత్తిరభీతవాసః
షడ్ జీవలోకస్య సుఖాని రాజన్"

ఓరాజా! నిత్యము ఆరోగ్యము కలిగియుండుట, అప్పులు లేకుండుట, స్వదేశమునందే ఉండుట, మంచి మనుష్యులతోడి స్నేహము, ఆత్మవిశ్వాసముతో చేయదగిన వృత్తి, భయము లేక జీవించుట- ఇవి ఆరు మనుష్యులకు సుఖము నొసగునట్టివి.

# ద్వేషం......

"రక్తమాంసము లొకటైయుండ, వ్యక్తిగత ద్వేషాలేలనోయ్?" అంటూ మానవుల మధ్య పెరిగిపోతున్న ఈర్ష్యాసూయలను, ద్వేషభావాన్ని దృష్టిలో పెట్టుకొని ఓ కవిగారన్న మాటలవి. నిజమే! మానవులందరిలోను ప్రవహించేది ఎఱ్ఱని రక్తమే! అందరి శరీరాలు ఎఱ్ఱని మాంసఖండ నిర్మితాలే! అయితే ఈ రక్తంలో 'ఎ' గ్రూపని, 'బి' గ్రూపని, 'ఎబి' గ్రూపని, 'ఒ' గ్రూపని రకాలుంటాయని వైద్యశాస్త్రజ్ఞులు నిర్ధారించారు. వైద్యశాస్త్రరీత్యా ఆ విభజన జరిగిందికాని రక్తం ఒక్కటే! అందుకే కవి అలా రాశాడు!

రక్తమాంసములెలా ఉన్నా, మానవుల్లో రంగు, రూపం, స్వభావం వంటి లక్షణాలు రకరకాలుగా ఉంటాయి. ప్రతి మనిషికి ఆలోచనాశక్తినిచ్చే మెదడు (పెద్ద మెదడు) ఉంటుంది. ఆ ఆలోచనాశక్తిని బట్టే, మనుషుల్ని బుద్ధిమంతు లని, బుద్ధిహీనులని అంటుంటాము. వివేకవంతులకు యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము ఉంటుంది. ఇంకొంచెం వివరంగా చెప్పాలంటే, వివేకవంతులు, వివేకహీనులని కూడ అంటుంటాము. మంచి చెడ్డల రెండింటి బేధము గ్రహించ గల్గుతాడు. కష్టసుఖాలు రెండింటిని సమదృష్టితో స్వీకరించ గలశక్తి కలిగి ఉంటాడు వివేకహీనులు తద్భిన్నంగా ఉంటారు.

తనకు దుర్మార్గం తలపెట్టినవానిని సైతం ద్వేషించక పోవడం - ద్వేషభావంతో చూడకపోవడం వివేకవంతుని ఉత్తమ లక్షణం. ఎందుకంటే అలాంటి ద్వేషభావమనే దురాలోచన తన మానసిక నిగ్రహాన్ని సడలిస్తుందని ఆతనికి తెలుసు! ఒక వ్యక్తి దుర్మార్గం చేస్తే, అది అతని తప్పని భావించడు. ఆవ్యక్తి, ఆ దుర్మార్గం చేయడానికి నియుక్తుడైన, నిమిత్త మాత్రుడు మాత్రమేనని భావిస్తాడు. ఒక వేళ ఆవ్యక్తి చేయక పోయినా, మరొకరైనా ఆ దుర్మార్గం చేయడానికి నియుక్తు లవుతారు. యజమాని ఆదేశించిన ప్రకారం చేయడమే సేవకుని ధర్మం! సేవకుడు చేసిన దుర్మార్గానికి, ఆతనిని నిందించడంగాని, ద్వేషించడం గాని, శిక్షించడం గాని తగదు. ఉరి శిక్ష అమలు జరిపే తలారి ఖైదీ ప్రాణాలు తీశాడు కావున ఆతడు దుర్మార్గుడని, ఆతనిని శిక్షిస్తామా? అది ఆతని విద్యుక్త ధర్మము.

ఓ చిన్నకథ చూద్దాం! ఓ బాటసారి అడవి గుండా ప్రయాణిస్తున్నాడు. కొంత దూరం సాగేసరికి, ఓ పులి ఆతనిపై దూకబోయింది. పరుగు దీస్తూ దాపున ఉన్న ఓ చెట్టు పైకి ఎక్కేశాడు. తీరా పైకెక్కాక చూస్తే అక్కడో ఎలుగు బంటి ఉంది దాన్ని చూసేసరికి ఆతని పై ప్రాణాలు పైనే పోయినట్లయింది. పైన ఎలుగుబంటి, క్రింద పులి! అడకత్తెర లో పోకలా ఉంది ఆతని పరిస్థితి. అసహాయంగా, దీనంగా ఆ ఎలుగుబంటికేసి చూశాడు. ఇంతలో, ఆ మనిషిని క్రిందకు త్రోసేయమని ఎలుగుబంటిని కోరుతుంది పులి. ఆతడు తన రక్షణ కోరుతున్నాడు కాబట్టి తానా పని చేయనంటుంది ఎలుగుబంటి. కొంత సమయం గడుస్తుంది. ఈలోగా ఎలుగుబంటికి నిద్రొస్తుంది. అదను చూసి, ఎలుగుబంటిని తోసేయమని చెప్తుంది పులి. పులిని చూస్తుంటే భయపడి పోయిన, ఆ మనిషి, అలాగే చేయబోయాడు. ఎలుగుబంటికి మెలుకువ వస్తుంది. అప్పుడు పులి మాట మారుస్తుంది. "నీకు దుర్మార్గం తలపెట్టిన ఆ మనిషిని యిప్పటికైనా క్రిందకు త్రోసేయ"మని చెప్తుంది.

## సోమంచి రామం

"అది వాని తప్పుకాదు. నీ మాట ప్రకారమే ఆతడా పనికి పూనుకున్నాడు. అందుకని నేనాతనిని త్రోసేయను. దైవమే ఆతనికి తగిన శిక్ష విధిస్తాడు" అంటుంది ఎలుగుబంటి.

లంకాపురిలో అశోకవనంలో సీతను చూస్తాడు ఆంజనేయస్వామి. తన సంగతి అంతా చెప్పుకొన్నాక, ఆమెకు నమ్మకం కలిగించాక రాముని దగ్గరకు మోసుకుపోతానని అంటాడు అందుకు సీతాదేవి అంగీకరించదు. అది మర్యాద కాదంటుంది. ఆమె కోరినట్టుగానే, రాముడు వానర సైన్యంతో వచ్చి రావణాసురుని వధించి, ఆమెను తీసుకొని వెడతాడని ధైర్యం చెప్తాడు. అప్పుడు అంతవరకు ఆమెను పలువిధముల బాధించి, వేధించి, హింసించి, కష్ట పెట్టిన రాక్షస స్త్రీలందరిపైన ప్రతీకారం తీర్చుకోవచ్చునని కూడా చెప్తాడు.

అందుకు సీతాదేవి అంగీకరించదు. తనను హింసించడం వారి తప్పుకాదు. యజమాని ఆజ్ఞ ప్రకారం తమ విధిని నిర్వర్తించడం వారి ధర్మం. అందువలన వారు దుర్మార్గం చేశారని వారిని ద్వేషించడం తగదని హితవు పల్కుతుంది.

కావున దుర్మార్గం చేసినవాని పై ద్వేషభావం రానీయడం మంచిది కాదు. ●

Postal Registered
No.H/M.P.M./34, Dt 10-12-1984

SREEVANI
JUNE 2000

Regd with Registrar of News
Papers Regd No. 45039/85



EDITED, PRINTED AND PUBLISHED BY SRI KOMARAGIRI KRISHNA MOHAN RAO
*Printed at Sreevani Offset Printers, Machilipatnam - 521 001. Ph: 21137*